# శైలగీతము

(అతిప్రాచీన తమిళ వాఙ్మయ పరిచయముతో కూడినది)


తమిళ మూలం :

మహాకవి కపిలర్

తెనిగింపు :

బహుభాషాప్రవీణ

ముదునూరి జగన్నాథరాజు


ఖ్యకవివరుడు కపిల
వాదము. ద్విపద,
ాసియున్నాను.
విరుద్ధము


విశ్వశాంతి ప్రచురణాలయం

రాజపాళయం (తమిళనాడు)

# తొలి పలుకు

నేను స్వయంకృషిచేత తెలుగు సాహిత్యము గఱచినవాడను. 15వ శతాబ్దమున వలసపోయి తమిళదేశమున స్థిరపడిన తెల్గుజాతికి చెందిన వాడను. మాతృభాష తెలుగయినా, తమిళదేశపు తెల్గువారికి తెల్గక్షరములు బొత్తిగారావు. ఇంటిలో తమిళ మిశ్రమైన తెల్గుమాట్లాడినా, తెల్గువిద్య లేదు. తమిళమే చదువగలరు.

కాని మా రాజపాళయమున మాత్రము, భాషోద్ధారక సాధు వరద రాజం పంతులు, మదరాసు ప్రధానిగాను, ఒరిస్సా గవర్నరుగాను ఉండిన, కీ. శే. శ్రీ పూసపాటి కుమారస్వామిరాజా ప్రభృతుల కృషివల్ల హైస్కూలులో తెల్గు నేర్పించుచున్నారు. కాని తెల్గు సాహిత్య పరనమునకు తగిన ప్రోద్బలములేదు. దక్షిణాంధ్ర కవులు చేసిన సాహిత్యసేవ, దక్షిణాంధ్రులు తమిళభాషకు, తమిళదేశమునకు చేసిన సేవ అమూల్యమైనది. వారి ఆదర్శములు, వారి చరిత్రలు నన్ను పురికొల్పినవి. కాన తెలుగున పాండిత్యము లేనప్పటికి, నా శక్తికొలది తమిళ, తెలుగు భాషా సాహిత్య పరిచయములను ద్విభాషలందును చేయ పూనుకొంటిని. విద్వత్కవికుల తిలక, శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు, విజయవాడ, G. సుబ్బరాజు గారి వంటి మహనీయుల మైత్రి కలిగినందువల్ల నాకు కొంతధైర్యము కలిగినది.

నా ఈ కృతి తమిళమున అతి ప్రాచీన ముఖ్యకవివరుడు కపిల మహాకవి రచించిన 'కుఱింజిప్పాట్టు' కు తెలుగనువాదము. ద్విపద, మంజరీద్విపదలను మేళవించి, నా ప్రత్యేకశైలిలో వ్రాసియున్నాను. నాశైలి, ముఖ్యముగా వచనమందు వింతగాను, వ్యాకరణ నియమ విరుద్ధము గాను ఉండవచ్చును. కాని తమిళదేశపు చివరలో నున్న నా యొక్క వాతావరణమును గుర్తించి పండిత ప్రకాండులు పుత్రవాత్సల్యముతో మన్నింతురని నమ్మెదను.

తమిళ ప్రాచీన వాఙ్మయ పరిచయము చేసియున్నాను. ఇది తమిళ సాహిత్యమును గుఱించి తెలియగోరువారికి నుపకరింప గలదని నమ్ము చున్నాను.

ఈ కృతినిజూచి నన్నుత్సాహపరచి సందేశములిచ్చిన మధుర, యూనివర్సిటి వైస్ ఛాన్సలర్, శ్రీ. తె. పొ. మీనాక్షిసుందరనార్ గారికి, కవియోగి, మహర్షి శుద్ధానంద భారతిగారికి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్య నారాయణ గారికి, గుఱ్ఱం జాషువకవి గారికి నా కృతజ్ఞత నర్పించు కొనెదను.

మహాకవివరులగు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు ఈ కృతిలోని పద్యభాగమును చదివి స్ఖాలిత్యములను దిద్ది నన్ను ప్రోత్స హించినారు. ఇది నా భాగ్యమని తలచెదను. వారికి నా నమస్కృతులు, కృతజ్ఞతలు తెల్పుకొనెదను.

మాతృభాష తెలుగయినా తమిళమున అద్వితీయ పాండిత్యము గడించిన వారును, వీరపాండ్యకట్టబొమ్మన వంశీయులునగు శ్రీ కవిరాజ పండిత జగవీర పాండ్యనార్‌గారు నా ఈ కృతికి ఆశీస్సు పద్యమును తమిళ మున నొసగినారు. నాపై ఆదరాభిమానములు గల ఆ కవిశ్రేష్ఠులు ఆశీస్సు పద్యమొసగిన నెల రోజులకే కీర్తిశేషులైనారు. వారి ఆత్మ శాంతి నొందు గాత !

నా కృతి ప్రచురణకు చేయూత నొసగిన మన్మిత్రులును తమిళాంధ్ర భాషా సాహిత్య సేవాతత్పరులునగు శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారికి, నాపై ఆదరాభిమానములుగల స్వార్థరహిత త్యాగశీలురగు విజయవాడ శ్రీ గో రా గారికి నా కృతజ్ఞతలు.

తెలుగుకావ్య సంప్రదాయము ననుసరించి ఈ కృతి విజయవాడ సిరీస్ ఇన్‌స్టిట్యూట్, శ్రీ G. సుబ్బరాజుగారికి కానుకగా నొసగుచున్నాను. వారు నాపై చూపు ఆదరాభిమానములకు సదా కృతజ్ఞుడను. ఈ కృతి చక్కగా ముద్రించిన ఫ్రీడమ్ ప్రెస్సు M. బాలసుందరం గారికి, ప్రూఫులుచూసి సహక రించిన మిత్రులు Ch. మాధవకృష్ణకవి గారికి నా కృతజ్ఞత తెల్పుకొనెదను.

నా కొఱతలను మన్నించి ఆంధ్రలోకము ఈ కృతి నాదరించి, తమిళాంధ్ర భాషా సాహిత్య సమైక్యతకు చేయూత నొసగు గాత !

రాజపాళయం
1-3-68

ఇట్లు,
ముదునూరి జగన్నాథరాజు

# కానుక

ఆంధ్ర శాసనసభలందు నగ్రగణ్య !
వైద్యశాస్త్ర విశారద ! వాసికెక్కి
విజయవాడలో కీర్తితో వెలయువాడ !
సిరి సుగుణ సంపదలుగల చెలిమికాడ !

మబ్బు బోలిన ఈవియు నుబ్బు సంద్ర
మొప్పు వైభవస్ఫూర్తియు నుల్లసిల్లు
సుబ్బరాజను తేజుడ ! కబ్బ మిద్ది
కానుకగా నీకు నిచ్చితి గైకొనుమ్మ !

మిన్నులో వెల్గు చుక్కల మేల్మివోలె,
ఆయురారోగ్య సంపదలంది నీవు
ఆంధ్రభాషా సుకవులను ఆదరించి
వెలుగుచుండుము కీర్తితో వేడ్కమీఱ.

—ముదునూరి జగన్నాథరాజు

**Sri T. P. Meenakhi Sundaram,**
M.A., B.L., M.O.L.
*Vice-Chancellor,*
*Madurai University, Madurai.*

Tamil is one of the classical languages though it continues to a modern language. It is very unfortunate that its treasures are not available for study by the people of even the neighbouring states, especially in these days when everyone is emphasising the national integration of this country. Therefore one has to congratulate Tiru Jagannatha Raju for giving us a Telugu translation of Kurincippattu the mountain song which is one of the longer poems of the sankam age. The tradition is that an Aryan King Brahatha inquired of the great Sankam poet Kapilar what Tamil was and that for explaining the essence of Tamil culture and literature, the poet composed this Mountain Song. Therefore it is probably Tiru Raju has chosen this song for translation. He was kind enough to read the whole of this translation to me, when I went on comparing it with the original. I was happy to find that it is a very good and true translation bringing out the beauties of the original in his beautiful Telugu.

I hope that this translation will bring Tamil nearer to the Andhras and will form one of bridges uniting the heart of the Tamils and the Andhras.

Madurai.<br>15-7-'67 (Sd.) T. P. MEENA

# Kaviyogi Maharishi Shuddhananda Bharati

(YOGA SAMAJ)

SRIRAM NAGAR, ADYAR, MADRAS-20.

THE TELUGU POEMS OF

**SRI JAGANNATHA KAVI**

I have known Sri Jagannatha Kavi since long. He is a genius in the field, a born poet and an erudite scholar in Tamil and Telugu. He has translated many Tamil Poems into Telugu. I had the joy of hearing his SAILA GITAMU WITH ITS JINGLING AND TINGLING STYLE full of poetic fervour in each line.

It is the Telugu rendering of the famous *Kurunji pattu,* a sangham literature which every Tamil scholar must read. It is like the Megha Dhutam of Kalidasa.

Kurunji Pattu is a mountain song composed by saint kapilar and appreciated by the Savanta of the Third Tamil Sangham. The author in the poem reveals to the Aryan King Prahattan, the charms and beauties of the Tamil literature in 261 verses. It is the Love story of a mountain chief, who was clandestine relations with a lovely lady. Her mother objects to this. But the maid serving the lady gives such an account of the chieftain's heroism. He tells the mother how the hero saved the lady from a rut elephant and a wild stream. The mother is pleased at last, and the young lovers marry and are happy. True love never runs smooth ; the brave deserve the fair. This idyl of psychic love is painted in rich colours of words and ideas.

Sri Jagannatha Kavi is at his best in this telugu rendering. I hope the Andhra Savants will encourage him and popularise his well-merited poem. I wish the kavi all success in life ! AUM

**—Yogi Shuddhananda Bharati**

గుఱ్ఱం జాషువ, M. L. C.
గుంటూరు.

ఉభయ కవిమిత్రా ఆశీస్సులు, మీ కృషి మెచ్చదగ్గది. ఆదరణీయమైనది. మీ ద్విపదరచన ప్రతిపద రమణీయమై తీయగా నున్నది. నాయికానాయకుల శృంగారాలు నేడుపకరింపవు. జృంభించిన దుష్టశక్తుల నున్మూలించు శిలీముఖాలవంటి నవ్యరచనలు నేడెంతయు నవసరములు. ఒక జాతికి, మతానికి, వర్ణానికి మాత్రమే యింపుచేయు వీలునామా కవిత్వములకు స్వస్తిచెప్పి, నీ కలాన్ని నిర్భయంగా నడుపగోర్తాను. అట్టి కృతులకు చావులేదు. నీకు శుభము.

జాషువ.

కవిరాజపండిత
జగవీరపాండ్యనార్,
మధుర.

அரியபெரும் புலமையுயர் கபிலர் முன் அருளியவெண் குறிஞ்சிப் பாட்டின்
உரியபொருள் வளங்களெலாம் உயர்தெலுங்கின் மொழிவழியே உலகிற் கீந்தான்
பெரியபல புலமையுடன் பெருங்குணங்கள் பல நிறைந்தோன் பேணி யாரும்
தெரியவரு புகழுடைய ஜகந்நா ராஜ எனும் சீர்மையோனே!

செகவீரபாண்டியன்
9—6—'67

కవిసమ్రాట్

విశ్వనాథ సత్యనారాయణ,

విజయవాడ.

శ్రీ ముదునూరి జగన్నాధరాజుగారు తమిళ దేశములో రాజపాళెము నివాసులు. ఆంధ్రులు. ఎప్పుడో అక్కడికి పోయి నివాసమున్న తెలుగు కుటుంబమువారు. ఆంధ్రభాషాభిమానము, ఆంధ్రాభిమానము చక్కగా నిలబెట్టుకొన్నవారు. వారు కపిల మహాకవి వ్రాసిన 'కురించిపాట్టు' అన్న అరవ కావ్యమును తెలుగుభాషలో ద్విపదగా రచించిరి. ఈ ద్విపద యెంతో రమ్యముగానున్నది. ఆంధ్ర భాషలోనున్న పూర్వద్విపద కావ్యములలో దేనికిని తీసిపోనట్లున్నది. వీరు మరియు నెంతో సేవ యాంధ్రభాషకు చేయ గలరు. వీరికి తగినంత ప్రోత్సాహ మాంధ్రు లీయవలయును. వీరికి భగవంతు డాయురారోగ్యములు ప్రసాదించుగాక.

విశ్వనాథ సత్యనారాయణ,

విజయవాడ,

16-1-67.

# తమిళ సాహిత్య పరిచయము

భారత దేశము పవిత్రమైన దేశము. హిమవత్పర్వతము నుండి కన్యాకుమారి వఱకునున్న యీ విశాలభూభాగమున వివిధజాతులవారు, వివిధ భాషలవారు, వివిధ మతావలంకులు నున్నారు. భిన్న నాగరకత, సంస్కృతి కలిగియున్నప్పటికి, భారతీయులమను భావసమైక్యత, ప్రత్యేకశక్తివంతమైన జాతీయత ఉన్నవి. మన వేద వేదాంగములు, షడ్దర్శనములు, శాస్త్రములు, కావ్యములు, మన దేశపు విశిష్ట ప్రతిభను వేనోళ్ల చాటుచున్నవి. ఇట్టి ప్రతిభావంతమైన మన భారతీయ భావసమైక్యతను జాగ్రత్తగా నిలబెట్టుకొనవలయును. ప్రాంతీయాభిమానములు, మాతృభాషాభిమానములు, భారతీయ సంస్కృతికి, భంగము కలిగింపకుండ చూచుకొనవలయును. కావున మనము మన సోదర భాషలలోనున్న సాహిత్యములు, వాని గొప్పతనము, కళాస్రష్టలు, సంస్కృతి, శిష్టాచారములను గుర్తుంచుకొని సమానగౌరవముతో కలసిమెలసి యుండవలయును. ఇందుకు తమ సాహిత్యమును పరభాషలయందనువదించుటయు పరభాషా సాహిత్యములను తమ భాషలోని కనువదించుకొనుటయు చాలా అవసరమైనపని. ఈ కార్యమునకు విజ్ఞులు పూనుకొనవలయు. ఈరీతిని తమిళభాషలోని సుప్రసిద్ధ కావ్యరాజ మొందు అనువదించి ఆంధ్రమాత పాదంబుల కర్పించుచున్నాను.

## తమిళుల విశిష్టత-తమిళాంధ్రుల సమైక్యత

తమిళులు, తెలుగువారు, కర్ణాటకులు, కేరళులు జాతిచేత ఒక్కరే యనుట విద్వాంసుల సిద్ధాంతము. అతి ప్రాచీనకాలములో వీరందఱును ఒకేజాతిగానుండి, ఒకే భాష మాటాడినారనియు తెలియుచున్నది. ఆ మూలభాషను ద్రావిడమని డాక్టరు కాల్డ్వెల్ మహాశయుడు పేరిచ్చెను. కావున ద్రావిడభాషా కుటుంబమున ప్రాచీన సాహిత్యము గల భాష తమిళము. ఆంధ్రులకు ఆర్య భాషా సాహిత్య సంపర్కము మెండు. సంస్కృత భాషాసాహిత్యము, విజ్ఞానము భారతదేశమంతట వ్యాపించి పండితుల నాకర్షించి నందువలన దేశభాషలకు అంతగా ప్రోత్సాహము లభింప లేదు. కాని ఇకనైన ద్రావిడ భాషలందున్న సాహిత్యములను ప్రచారమునకు తెచ్చుట ఆవశ్యకము.

తమిళుల విశిష్టప్రతిభ అమోఘమైనది. సాటిలేని వారి సాహిత్యము, వారి "శైవ సిద్ధాంతము" అను తత్త్వ గ్రంథాలు, వారి శిల్పకళా నైపుణ్యము, గుడిగోపురములందలి శిల్పము-అన్నియు వారి ప్రతిభను స్పష్టముగా తెలుపుచున్నవి. తమిళులైన, శంకరాచార్యుడు, రామానుజాచార్యుడు, అప్పయదీక్షితుడు, నాయనారులు, ఆళ్వారులు, తమ భక్తిగీతములచేతను, భగవత్కైంకర్యములచేతను, భారతమంతయు పునీతము గావించినారు. కంబకవి, తిరువళ్లువర్, ఇళంగో, వడిగళ్, శాత్తనూర్, ఔవైయార్ మొదలగు కవులు వెలసి వన్నెకెక్కినారు. చేర చోడ పాండ్యులు

దక్షిణభారతమేగాక, లంక, జావా, బర్మావంటి దేశము లను కూడా పరిపాలించి తమ ప్రతాపము చూపి ప్రఖ్యాతిఁ బడసినారు. పారివళ్లల్, పేకణ్, కుమణన్‌వంటి దాతలు, సిద్ధపురుషులు, వీరులు వెలగి వాసికెక్కినారు.

తెలుగు, కన్నడ, మలయాళభాషలు ఆర్య భాషా సంపర్కముచే తమ స్వరూపము గోల్పోయి, మిశ్రమభాష లైనను, తమిళము మాత్రము తన ప్రతిభవల్ల శక్తినంత మైన విశిష్టతను కాపాడుకొని నిలిచియున్నది. అతిప్రాచీన మైన సాహిత్యములను కలిగి నేటి జనప్రచారమందున్న భాష తమిళమే యనుట అతిశయోక్తి కాదు. తమిళమున క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దపు కావ్యములు లభించు చున్నవి. అంతకు పూర్వ సాహిత్యములుగల సంస్కృత ప్రాకృతాదులు, పాశ్చాత్య భాషలైన గ్రీకు, హీబ్రు- లాటిన్ భాషలకు, నేడు ప్రచారము లేదు గాన తమిళము అతి ప్రాచీన సాహిత్యముగల సజీవభాషయనుట సమంజసమే యగును.

తమిళ ప్రాచీన గ్రంథములందు ఆంధ్రులను గురించి చెప్పబడి యున్నందువల్ల పూర్వకాలమునుండియు తమి ళాంధ్రుల సమైక్యత యుండి యుండవచ్చును. పిదప క్రీస్తు తర్వాత పదవ శతాబ్దమునుండి చోడరాజులు ఆంధ్రులతో వియ్యముపొంది 'ఉభయకులోత్తుంగు' లైనవెంటనే ఆ ఐక్యత హెచ్చినది. కరికాలచోడుని వంశీయుడైన, నన్నిచోడుడు, తమిళదేశ బ్రాహ్మణుడని భావింపబడు నన్నయ తెల్గున

ప్రప్రథమ కావ్యములు వెలయించినారు. పాల్కురికి సోమనాథుడు తమిళ భాషా పాండిత్యము గడించినట్లు విశదమగుచున్నది. కంబ మహాకవి ఓరుగల్లునేలిన ప్రతాపరుద్రుని ఆశ్రయించెనని తెలియుచున్నది.

దక్షిణ భారతమంతయు నేకచ్ఛత్రముగ నేలిన కృష్ణదేవరాయలు తమిళ కవయిత్రియైన ఆండాళ్ గాథను 'ఆముక్తమాల్యద' కావ్యముగా రచించి కృతార్థుడయ్యెను. కళాపూర్ణోదయమున పింగళిసూరన తమిళ దేశ ప్రకృతి సౌందర్యములను వర్ణించికొనెను. తమిళ కవులై, భక్తిరసపూరిత స్తోత్ర గ్రంథములు రచించిన, నాయనారుల, ఆళ్వారుల చరిత్రములు తెల్గు సాహిత్యమున ఇతివృత్తములైనవి. తమిళనాడును ఆంధ్ర నాయకరాజులు పరిపాలించి సాహిత్య సంగీతములను ప్రోత్సహించినారు. తమిళ దేశమున ఉత్తమ తెల్గు కవివరులు, కవయిత్రులు కలిగినారు. తెల్గు పంచ కావ్యములందొకటైన "వసుచరిత్ర"ను 17 వ శతాబ్దమున "అంబలత్తాడుంఅయ్యర్" అను కవీశ్వరుడు తమిళ భాషలోనికి ననువదించి ద్విభాషా సాహిత్య సమైక్యతకు పునాది వేసినాడు. తమిళ దేశమంతటను తెలుగు మాతృభాషగా గలవారు వేన వేలున్నారు. సంగీతమునకు తెలుగుభాష పేర్వడసెను. ఇట్లు తమిళ, తెల్గుభాషలు గతశతాబ్దములందు సమైక్యత గలిగియుండుట చరిత్రవల్ల తెలిసికొనుచున్నాము. ఆ ఐక్యతను పెంపొందించి పరస్పర మైత్రితో సాహిత్య సంపర్కముతో, మెలగ ద్విభాషా విశారదులు పాటుపడవలయును.



# సాహిత్య పరిచయము

తమిళ సాహిత్యము అద్వితీయము. ముఖ్యముగా క్రీస్తు పూర్వము రెండు, మూడు శతాబ్దములందు వెల సిన అతిప్రాచీన వ్యాకరణ గ్రంథమగు 'తోల్కాప్యము' నుండి క్రీస్తు తర్వాత పదుమూడవశతాబ్దమున వెలసిన కంబ రామాయణము వరకునుగల కాలఘట్టమున అత్యుత్తమ కావ్యములు వెలసినవి. దానికి తరువాత కలిగినవి చర్విత చర్వణములైన పురాణములు, శృంగార ప్రబంధములే. కావున తమిళమున కంబకవికి పూర్వ సాహిత్యములే ఉత్తమ సాహిత్యములు.

క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దమునుండి క్రీస్తు వెనుక ఐదవ శతాబ్దమువరకునుగల అతిప్రాచీనమైన సాహి త్యములను "సంఘకాల సాహిత్యములు" అందురు. అనగా మధురాపురిలో నుండిన పాండ్యరాజులు సాహిత్య గోష్ఠులు జరిపి, 'సాహిత్య సంఘము' నెలకొల్పి, కవి పండితగాయకు లను పోషించిరి. భాషాభివృద్ధికై ప్రోత్సహించిరి. రచ యితల గ్రంథములను పండిత ప్రకాండులు పరిశీలించి ఆమో దము పొందిన గ్రంథముల నాదరించిరి. ఆకాలమున వెలసిన గ్రంథములను సంఘకాల సాహిత్యమందురు. ఈకాలపు తమిళభాష స్వతంత్రమై, శక్తివంతమై మెలగినది. సం స్కృత పదములు ఏ ఒకటో రెండో తప్ప ఎక్కువ కన

బడవు. అచ్చ తెనుగు కావ్యశైలికిని, నేటి ఆంధ్ర భాషా కావ్యశైలికిని ఎంత తేడా కలదో అంత తేడా ఈ పూర్వకాల తమిళ భాషయగు "శెందమిళము"నకును నేటి తమిళమునకును కలదు. ఇట్టి సహజమైన, సజీవమైన భాషలో ఆనాటికవులు తమరచనల సాగించినారు. వారి పద్యములు మిక్కిలి చాటు పద్యరూపములందు అభూతకల్పన లేవియులేక, అందము చిందులాడు మృదుమధుర శైలిలో, స్వభావోక్తి, ఉపమ, అప్రస్తుత ప్రశంసాలంకారములతో, వెలయుచున్నవి. విశ్వాసానర్హ విషయాలేవియు నిందు లేవు. సహృదయ హృదయాకర్షకమై ధ్వని గర్భితమైన భావగాంభీర్యములతో సహజ సౌందర్యముతో, కవిత్వము అలరారుచున్నది. చారిత్రకాంశములు మెండుగానున్నని. నాయికా నాయకుల పరస్పరానురాగ చిత్త వృత్తులును చేరచోడ పాండ్య రాజులవీర్యము, ఔదార్యము, త్యాగశీలములు, దాతల చరిత్రలు, తమిళ ప్రజాజీవితము, ప్రకృతి సౌందర్యవర్ణనలు, ఈ గ్రంథములందు వర్ణింపబడియున్నవి. హాలనేత రచితమైన "గాథాసప్తశతి" ఎట్లు వివిధ కవివరుల గాథలు క్రోడీకరింపబడి, సామాన్య ఆంధ్ర ప్రజాగ్రామ జీవితమే చిత్రింపబడినదో అట్లే యీ గ్రంథములుకూడ తమిళమున వెలయుచున్నవి.

ప్రాకృతభాషలో వెలసిన 'గాథా సప్తశతి'కి పోలిక గల సంఘకాల సాహిత్యముల స్వరూపము దిఙ్మాత్ర సూచనగా యీ క్రింది పద్యములను చూడ విశదముకాగలదు.

"క్రొందేనెఁ గ్రోలుచుం గూర్చి జీవించు
భ్రమరమా! నిష్పక్ష పాతివై నీవు
నిజమును చెప్పుమా! నెయ్యంబు మిగులు
నెమలినింబోలిన నెలతుక కురుల
కన్నను మిగులు సుగంధము కలదో?
నీ వెఱింగినయట్టి పూవుల యందు

(కుఱుందొకై-2, ఇరైయనార్ రచన)

*　　　　*　　　　*

(నాయకుడు నాయికను ప్రశంసించి పలుకుట.)

కొక్కొ్కర కోయని కూసెను కోడి
అక్కట! నాయెద అలమట చెందె.
బిగిగౌగిటంజేర్చు ప్రేముకుం బాయ
తెగకోయు వాలునా తెలవాఱెనంచు.

(కుఱుందొకై. 157.) (అళ్లూరు నన్ముళ్లై రచన)

*　　　　*　　　　*

(నాయిక పలుకులు)

అన్నియు మనదేశ మందఱు మిత్రు
లెన్నఁ గీడునుమేలు నితరులచేత
రాదని తెలియుడు! బాధసౌఖ్యములు
నీరీతి యేయగు నీభువిలోన
చావు వింతయుకాదు! జీవితమదియు
శుభమని మురియుట సుంతయులేదు
విసుగు నీ వెతయంచు వెఱచుట లేదు.

మెఱపులు మెఱయుచు మిన్నుండి వాన
చినుకులై పడికూడి శిలలను పోరి
జల జలయని పాఱు సెలయేఱులోని
ఉదకములోపోవు ఓడపోలికను
విధిమార్గముననె జీవితమును గడచు.
జ్ఞాన దర్శనమిద్ది చతురత నెఱిఁగి
యుండువారముగాన నున్నతులైన
పెద్దలఁ వింతగా పేర్మిఁ దలపము
చిఱుతలం గొఱతగా చింతింపబోము.

(పుఱనానూరు. 192.) (పూంగున్ఱరచన)

*　　　　*　　　　*

జలరాశి వలయిత జగములన్నియును
పరులకు లేకుండ పగలేని తనదు
వెలిగొడ్గు నీడలో వెలయించినట్టి
చక్రవర్తియగు రాట్చంద్రుడే యైన,
నిశియందుఁ బగలందు నిదురలేకుండ
మెకముల వెదకెడి మృగయుడేయైన
తినుటకుఁ దూమెడు దేహంబుఁగప్ప
నొండు వస్త్రముగాక మెండుగావలదు.
అక్కఱ లన్నియు నందఱికొకటె.
సిరికి ప్రయోజనం బెఱిగినఁబరుల
కిచ్చుట కేయగు నివ్వకతానె
అనుభవింతుననిన నన్నియు చెడును.

(పుఱనానూరు—189) (నక్కీరకవి రచన.)

*　　　　*　　　　*

ఇట్టి భావగాంభీర్యముగల వేనవేలు పద్యములు చాటువులుగా తమిళ సంఘకాల సాహిత్యమున గలవు. విశ్వ సాహిత్యమున అద్వితీయ విశిష్ట ప్రతిభకలిగి మిఱుమిట్లు గొల్పుచున్న యీ పద్య రత్నములు, భావగాంభీర్యము, పదలాలిత్యము, అర్థపుష్టి, రసపుష్టి, ఉచితశైలి, మృదుమధురములగు నుడికారపు సొంకములు కలిగియున్నవి. వివిధ కాలముల, వివిధప్రాంత నివాసులైన కవీశ్వరులు తమ స్వేచ్ఛపోల కల్పితముగా రచించిన యీ పద్యసుమములను అర్వాచీన రసజ్ఞులు సాహిత్య హారముగా గూర్చి మనకు నందచేసినారు. తమ బుద్ధియను కషణోపలమున (గీటురాయిమీద) గీచి చూచి రసవత్తరములైన శ్రేష్ఠ పద్యమణులనే ఏర్చి కూర్చి సొంపగురీతిని సంపుటములుగా నిర్మించి యున్నారు. వాటిని విపులముగా చర్చించుటకు చోటులేదు గావున క్లుప్తముగా చూతుముగాత!

తమిళమున మనకు లభించు మొట్టమొదటికృతి తొల్కాప్యము. ఇది లక్షణగ్రంథము. క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దమున రచించిపబడినదందురు. దీనినితొల్కాప్యర్ అను జైన మునీశ్వరుడు రచించెనని తెలియుచున్నది. ఈ ఉద్గ్రంథమునకు ఐదారు వ్యాఖ్యలు కలవు. ఇందు మూడు విభాగములు కలవు. మొదటి విభాగమున అక్షరములు, సంధి మొదలగు విషయములు విపులముగా వ్రాయబడినవి.

రెండవవిభాగమున వాక్యములు, క్రియ, తద్ధితము. సమాసములు మొదలగుఅంశములువ్రాయబడినవి. ఈ రెండ

భాగములందు వ్యాకరణాంశములు వ్రాయబడినవి. మూడవ భాగము "అర్థవిభాగము", ఇందు ఏయితర లక్షణగ్రంథము లందును లేని, తమిళసాహిత్య ప్రత్యేకాంశములనుగురించిన లక్షణములుగలవు. ఇందు, ఛందస్సు, అలంకారము, నిఘంటువుల సారాంశములు కలవు. రసము, ధ్వని విషయములు కూడ కలవు. ఇంతేకాక కావ్యసృష్టికి కావలసిన సకలశాస్త్రములును క్లుప్తముగా సూత్రరూపమున వివరింపబడియున్నవి.

నాయికానాయకుల ప్రేమ జీవితమును వర్ణించురీతి, సంభోగశృంగారము, విప్రలంభ శృంగారము – వీని లక్షణములుకలవు. కాని మన సంస్కృత అలంకార గ్రంథముల రీతికిని, దీనికిని చాల వ్యత్యాసముకలదు. సంస్కృత అలంకార శాస్త్రమునగల నాయికానాయకుల భేదములు, అవస్థలు, సాత్విక భావములు, సంచారిభావములు ఆంధ్రులకు విదితమే. కాని ద్రావిడసంప్రదాయము క్రొంగ్రొత్తయోగావున ఇంచుక వివరించుట అప్రస్తుతము కాదని నమ్మెదను. తమిళ ప్రాచీన కావ్యరీతులను గుర్తుంచుకొనుటకు ఇదిఎంతయు ఆవశ్యకము. తమిళ లక్షణకారులు కావ్యవిషయములను ద్విభాగములుగా విభజించియున్నారు. ఒకటి అకం (அகம்) ఇంకొకటి పురం (புறம்). అకంలో మనుష్యుని ఆంతరంగిక ప్రవృత్తులకు నెక్కువగా సంబంధించిన ప్రేమ జీవితము, (గృహస్థజీవితము)ను తెల్పుచున్నది. పురం అనగా బయట అనిఅర్థము. అనగా బాహ్యజీవితమును గురించిన విషయములు ఇందు చెప్పబడును. వ్యక్తిగతకుటుంబ జీవితము అకం అనియు, సాంఘికజీవితమును పురం అనియు విభజించియున్నారని

తెలియుచున్నది. పురంలో రాజుల ఈవి, యుద్ధలక్షణములు, నైతికవిషయములు వర్ణింపబడియున్నవి.

అకంలో ప్రేమప్రవృత్తులను వర్ణించుటలోకూడ కొన్ని విధి నిషేధములున్నవి. సంభోగశృంగారమునకు సంబంధించిన విషయములు గిరిప్రాంతమందు వర్ణించుటయే యుక్తమగును. విప్రలంభ శృంగారమును సముద్రతీరప్రాంతమున జరుగునట్లే వర్ణింపవలయును. ఈ నియమము కొంత మట్టుకు సమంజసముగానే తోచుచున్నది. ఆ యా ప్రదేశ వర్ణనలందు తదనుకూలమైన మనోవృత్తులను వర్ణింపవలయుననియు, ఆ ప్రదేశానుసారముగా పశుపక్షులను, తదితర వస్తువిశేషములను వర్ణింపవలయుననియుకూడ నియమములు కలవు. గిరిప్రాంతమందే సంభోగశృంగారము వర్ణింపవలయును. అనగా నాయికానాయకుల పరస్పరావలోకనము, చెలికత్తెద్వారా పరిచయము చేసికొనుట, గాంధర్వవిహితమునసే జరిగినట్లు వర్ణింపవలయును. ప్రస్తుతరచయితలవలె సముద్రతీరముననో, కొలనుగట్లులనో ప్రేమికుల పరస్పరానురాగోత్పత్తిని వర్ణించుపద్ధతి ఆనాటికి లేదు. తప్పనిసరిగా కొండలోనే అనురాగోత్పత్తిని వర్ణించితీరవలయును.

ఈ నియమము మనకు వింతగా తోపవచ్చు. స్థాయిభావమయిన రతికి, (ఆలంబన విభావమైన నాయికానాయకులకు,) ఉద్దీపనవిభావము ఈ గిరిప్రాంతమందే శ్రేష్ఠతరముగా నుండుననియే ఈ నిర్ణయము ప్రాచీన తమిళ లక్షణకారులు ఏర్పఱచిరి. వసుచరిత్రలో వసురాజు గిరికను సంద

ర్శించుట శైలప్రాంతముననేకదా? మనశృంగారప్రబంధము లందెల్ల శైలప్రాంతముననే నాయికానాయకుల పరస్పరావ లోకనముజరిగినట్లు వర్ణించియుండుట గమనార్హము. యథార్థ జీవితమున ప్రేమ ఎక్కడైనా ఎప్పుడైనా తోచవచ్చును కాని కాల్పనిక జగత్తైన కావ్యప్రపంచములో ప్రేమ గిరి ప్రాంతములోనే జరిగినట్లు వర్ణించు ఆచారమును కవులు కల్పించిరి. కాని, విప్రలంభ శృంగారమును గిరిప్రాంత మందు జరిగినట్లు వర్ణించుట తగదు. అనగా గిరిప్రాంత కన్యలను 'అభిసారిక'గా వర్ణింపవలయునేకాని 'ఉత్కంఠిత' గానో 'కలహాంతరిత' గానో వర్ణింపకూడదు.

ఉత్కంఠిత నాయిక వనప్రాంతమందున్నట్లే వ్రాయ వలెను. కలహాంతరిత నాయికను నగరప్రాంతమందున్నట్లే వర్ణింపవలయును. ఇట్టి నియమములు తమిళమున ప్రాచీన సంఘకాల సాహిత్యమందున్నవేకాని అర్వాచీనకవుల కృతు లందు కనిపించవు. కొండలోకాక తదితర ప్రాంతములను వర్ణించుపట్ల విప్రలంభ శృంగారము ప్రధానముగా కను పించుచున్నది. వనప్రాంతమున వర్షఋతువున సాయంకాల వర్ణనలో ప్రవాసహేతుక విప్రలంభ శృంగారము వర్ణింప బడును. తొలకరిమూచిన నాయిక నాయకుని ప్రతీక్షించుచు పలవరించుటయు, నాయకుడు మేఘజాలములం జూచి నాయిక నుద్దేశించి రథమున తిరిగివచ్చుటయు వర్ణింపబడును. కాళిదాసుని మేఘదూత వృత్తాంతము, వాల్మీకి కవీశ్వరుని రామాయణమున కిష్కింధలో వర్షాభ్రములంగాంచిన రామ చంద్రుని ప్రవాసక్లేశమును ఈ వనప్రాంతమందే జరిగినట్లు

సంస్కృతకవులు వర్ణించియుండుట గమనింపవలయును. ప్రవాసమును వనప్రాంతమున జరిగినట్లు వర్ణింపవలయునని నిర్ణయించిన తమిళ లక్షణకారుల నిర్ణయము సమంజసము గానే తోచుచున్నది.

నగరప్రాంత వర్ణనలో నాయకుడు తన పత్నికి తెలియక అన్యభామలతో (ముఖ్యముగా వేశ్య, ఉంపుడుకత్తెలతో)సల్లాపించుట నెఱిగి నాయిక కోపించి కలహాంతరితగా, ఖండితగా నున్నట్లు వర్ణింపబడియున్నది. ప్రణయకలహము తీర్చుటకు దూతుడు వచ్చుటయు, నాయిక నాయకుని, దూతుని మందలించుటయు ఇందలి విషయములు.

సముద్రతీరమున వియోగదుఃఖమునే వర్ణింపవలయును. విరహవేదన పొందిన నాయిక చిత్తచాంచల్యములను వర్ణించు పద్యములివి. మరుభూమిలో (ఎడారిప్రాంతమున) నాయకుడు నాయికను లేవదీసికొని పోవుటయు, అందువలన వియోగదుఃఖతురాలైన నాయిక తల్లి కూతును వెతకుచు పోవుటయు ఇందు వర్ణింపబడును.

ఇట్లు ఐదు ప్రాంతీయ భేదములు ప్రేమజీవితమున కలవు. ఇట్లే పురంలోకూడ భేదములు కలవు. అవి ఘోషయాత్ర, దండుకదలుట, కోటరక్షణ, యుద్ధము, విజయము అను భేదములు. ఇంకను ఉపభేదములును కలవు. ఇట్టి విషయములు తొల్కాప్యంలో చర్చింపబడియున్నవి. ఈలక్షణ గ్రంథము నియమము ననుసరించి సంఘకాల సాహిత్యములున్నవి :

అకంలోని భూవిభాగము, వస్తువిశేషములు, వర్ణింపబడు విషయములను ఈ పట్టికలో చూడనగును.

| పేరు | భూవిభాగము | వర్ణించుధర్మము | దేవుడు | కాలము | పశుపక్షులు |
|---|---|---|---|---|---|
| కురింజి | గిరి ప్రాంతము | సంభోగశృంగారము | కుమారస్వామి | హేమంతము జామము | ఏనుగు, ఎలుగు, నెమిలి |
| ముల్లై | వన ప్రాంతము | ప్రవాసము | శ్రీకృష్ణుడు | వర్ష ఋతు సంధ్య | దుప్పి, ఆవు, బెలవ |
| మరుదం | ఏటి ప్రాంతము (నగర) | ప్రణయకలహము | ఇంద్రుడు | వేకువ | ఎనుము |
| పాలై | ఎడారి | వియోగము | కాళి | మధ్యాహ్నము గ్రీష్మము | సింహము, శార్దూల గజముల పంతలు |
| నెయ్దల్ | సముద్రతీరము | విప్రలంభశృంగారము | వరుణుడు | అస్తమయకాలం | చేప, మరకం, కాకి. |

ఇందున్న కుఱింజి, ముల్లై, మరుదం, పాలై, నెయ్దల్ అను పేర్లు ఆ యా ప్రాంతీయ పుష్పములవలన కలిగిన పేర్లు. ఒక పద్యమునుచూచి ఇది కుఱింజి పద్యమని చెప్పినచో అందలి వర్ణనావిషయము సంభోగ శృంగారమనియు, గిరి ప్రాంతమందు జరిగినట్లు వర్ణింపబడియుండుననియు నిర్ణయింప వచ్చును. ముల్లైపద్యమనినచో అందు ప్రవాసహేతుక విప్రలంభ శృంగారము వనప్రాంతమందు వర్షాకాల సాయంకాలమున జరుగు ఘనటగావర్ణింపబడియుండునని నిర్ణయింప వచ్చును. కుఱింజి, ముల్లై అనునవి పుష్పనామములే ఐనప్పుటికి ఆ యా ప్రాంతీయ వర్ణనాధర్మములకు పర్యాయనామములుగా వాడబడుచున్నవి. ఈవిధముగ నేపురంలోకూడ పుష్పనామములే పర్యాయనామములుగా వాడబడియున్నవి.

అకం (ప్రేమజీవితము)ను ఇంకొకవిధముగా కూడా విభజించియున్నారు. కళవియల్, కర్పియల్ అను రెండు విభాగములు అవి. కళవియల్ అనగా (గూఢప్రేమ) పరులెఱుంగక ప్రేమికులు తమలోతాము కలిసికొని చరించుటయు గాంధర్వవివాహము చేసికొనుటయునగును. కళవియల్ లో కుఱింజి (గిరిప్రాంతసంభోగశృంగారము) పాలై, (ఎడారిప్రాంతము ద్వారా నాయికానాయకులు పోవుట) నెయ్దల్ (విరహతాపము) మూడును వర్ణింపబడును. కర్పియల్ అనగా (పాతివ్రత్యము) గృహస్థజీవితమున ప్రేమికుల ధర్మములు వర్ణింపబడును.

ఇందు ముల్లై (భర్తను ప్రతీక్షించు భార్యయొక్క ప్రవాసము) మరుదం (భార్యాభర్తల ప్రణయకలహము) ఈ రెండును వర్ణింపబడును. దీనిని స్పష్టముగా తెలిసికొనుటకు క్రింది పట్టిని గమనింపుడు.



కుఱింజి, పాలై, ముల్లై, నెయ్దం, మరుదం అను అకం లోని విభాగములను తిణై (థిణా) అందురు. తిణై అనగా ఆచారము అను అర్థముకలదు. ఈ తిణైలకు తుఱై (రంగము)లు కలవు. ఒక పద్యమును సూచించునప్పుడు తిణై-తుఱై (ఆచారము—రంగములు) సూచింపబడును. ఆంధ్ర కావ్యములందు ప్రతిపద్యమునకు ముందు పద్యనామ ములు (ఉత్పలచంపకాదులు) సూచించువాడుక ఉన్నట్లే ప్రాచీన తమిళపద్యములందు ప్రతిపద్యములోను తిణై-తుఱై విభజన సూచించియున్నారు. ఇట్లు సూచించుటవలన ఆపద్య వర్ణనావిషయము దిఙ్మాత్ర సూచనగా బోధపడగలదు. తుఱై అనబడు రంగప్రవేశ సూచనవల్ల పద్యభావము సుస్పష్టమగును. వీనిలో ముఖ్యమైన కొన్నిటిని చూడుదుము.

తిణై :—కుఱింజి. (గిరిప్రాంతము)

తుఱై 1. కైక్కిళై. (ఏకపక్షప్రేమ) నాయికానాయకు లందు పరస్పరానురాగమునకు ముందు కలుగు నాయకుని ప్రేమ. నాయిక ప్రేమించుట ఎఱుగక మునుపే తాను ప్రేమించుట. ఇరువురిలో ఎవరైనా ఒకరికి మాత్రము కలుగు ప్రేమ.

2. ఇయర్కై-పుణర్చి :—(స్వభావసంయోగము) నాయకుడు నాయికను యాదృచ్ఛికముగ కలిసికొని గాంధర్వ వివాహరీతిని సంయోగము పొందుట.

3. ఇడందలైప్పాడు (సంకేతస్థలగమనము) నాయికను చూచినచోటునకు వచ్చి, మఱియు కలిసికొనుట.

4. పాంగర్కూట్టం :—(మిత్రయోగము) చెలికానితో తన ప్రేమవృత్తాంతము తెలుపుట.

5. పాంగిమదియుడంబాడు (చెలి సమ్మతము) నాయికా నాయకుల పరస్పరానురాగమును ఎఱింగిన చెలి కత్తె వారి నెయ్యము నామోదించి సహకరించుట.

6. పకర్కురి :—(పగటిసంకేతస్థలము) నాయకుడు నాయిక ఇంటి పరిసరప్రాంతమున సంకేతస్థలమున, కలియుట.

7. పకర్కురిఇడైయీడు (పగటిసంకేత స్థలాంతరాయము) పగటిపూట వచ్చు నాయకుడు సంకేతస్థలమున కలుగు అంతరాయములచే నాయికను పొందక మరలుట.

8. ఇరవుక్కురి :—(రాత్రి సంకేతస్థలము) రాత్రిపూట నాయకుడు సంకేతస్థలమున వచ్చి కలియుట.

9. ఇరవుక్కురి ఇడైయీడు :—(రాత్రి సంకేతస్థలాంతరాయము) రాత్రిపూట నాయకుడు నాయికను పొందుటకు కలుగు విఘ్నములు.

10. వరైతల్ వేట్కై :—(పెండ్లికోరిక) రహస్యమైన నాయకుని రాకపోకలకు వగచి నాయిక ఊరివారి నిందలు తెలిపి పెండ్లి చేసికొమ్మని నాయకుని కోరుట.

11. ఒరువళితనత్తల్ :—(విరహదుఃఖసహనము) నాయకుడు స్వకార్య నిమిత్తముగా నాయికను వీడి వెడలు

టయు, నాయికను చెలికత్తె ఓదార్చుటయు, నాయిక సహానమును.

12. అరత్తొడునిట్రల్ :—(ధర్మసంస్థాపన) నాయిక మదన వికారమెఱిగిన తల్లికి చెలికత్తె నాయికానాయకుల అనురాగ వృత్తాంతము తెల్పుట.

పాలై :—(ఎడారి ప్రాంతము)

13. మడల్ :—(తాళాశ్వము) నాయకునికి నాయికనివ్వక పోయినచో నాయకుడు తన అనురాగమును ఎల్లరు నెఱుంగగోరి తాటాకులతో చేసిన గుఱ్ఱపుప్రతిమలో కూర్చొని నట్టనడివీధిలో సత్యాగ్రహము చేయుట.

14. ఉడన్ పోక్కు :—(రహస్యప్రయాణము) నాయకునికి నాయికనివ్వ తలిదండ్రులు సమ్మతింపకపోయిన, ప్రేమ దంపతులు తమ తలిదండ్రులకు తెలియక వేఱొకచోటికి పాఱిపోవుట.

ముల్లై :—వనప్రాంతము.

15. ఇల్వాళ్కై :— (గృహస్థజీవితము) పెండ్లి చేసికొనిన దంపతులు గృహస్థధర్మము నిర్వహించుట.

16. పిరివు :—(ప్రవాసము) నాయకుడు చదువునకో, సంపాదనకో, దూతుడుగానో, యుద్ధమునకో నాయికను విడిచిపోవుటయు నాయిక ప్రవాసదుఃఖ మనుభవించుటయు.

మరుదం :—(నగరప్రాంతము)

17. పరత్తైయిర్పిరివు :—(వేశ్యానురక్తము) నాయికగర్భకాలమున నాయకుడు వేశ్యానురక్తుడుగా తిరుగుట. నాయిక ఎఱిగి వగచుట.

18. వాయిల్ మఱుత్తల్ :—(ద్వారబంధనము) నాయకుడు వేశ్యావాటికకేగిరాగా నాయిక తనఇంటికి రావలదని నాయకుని మందలించుట. ప్రణయకలహము.

నెయ్దల్ :—(సముద్రతీరప్రాంతము)

19. కామమిక్క కళిపడర్ కిళవి :—(కామోద్రేకోక్తులు) నాయిక విరహతాపముతో చంద్రోపలంబనమాదిగా పలువిధముల పలవించుట.

20. పెరుందినై :—(వృద్ధాచారము) ముదుసలి దంపతుల ముచ్చటలు.

తురై అనబడు రంగములు రమారమి వందవఱకున్నవి. కోవై అనబడు తమిళ ప్రబంధ కావ్యములందు ప్రతి రంగమునకు ఒక్కొక్క పద్యముచొప్పున రచించుపద్ధతి కలదు. అకం అనబడు ప్రేమకావ్యపు సొంపు కోవై అనబడు ప్రబంధమున విశదముగ కలదు. పురం అనబడు ప్రేమేతర కావ్యములందు పుఱనానూరు, తిరుక్కురళ్ వంటి సద్గ్రంథములు వెలయుచున్నవి.

ఇక తమిళ సంఘకాల సాహిత్య గ్రంథములను గుఱించి ఇంచుక గమనింతము.

## 21

## తమిళ సంఘకాల సాహిత్య గ్రంథములు

తమిళమున అతిప్రాచీనకాల సాహిత్యములైన సంఘ కాల సాహిత్యగ్రంథములన్నియు గాథాసప్తశతివలె పద్య సంగ్రహములైన సంపుటగ్రంథములే. వివిధ కాల, వివిధ ప్రాంత, వివిధజాతులకు చెందిన కవివరుల కవితలను రసజ్ఞులు క్రోడీకరించి సంపుటములుగా విభజించియున్నారు. అవి మొత్తము ముప్పదియారు గ్రంథములు. ఎట్టుత్తొకై (అష్ట సంపుటములు) పత్తుప్పాట్టు (దశగీతములు) పదినెణ్కీళ్క్కణక్కు (అష్టాదశలఘు గ్రంథము) అని వానిని పేర్కొందురు. ఎట్టుత్తొగై అను ఎనిమిది గ్రంథములు పెద్దవి. పత్తుప్పాట్టు అను దశగీతములు చిన్న గ్రంథముల సంపుటము ఏకగ్రంథముగ రూపొందియున్నది. ఈ దశగీత అష్ట సంపుటములను అష్టాదశగ్రంథ గ్రంథములందురు. మిగిలిన అష్టాదశ లఘుగ్రంథములందు తిరుక్కుఱళ్ జగత్ప్రసిద్ధమైనది. ఇంకను నాలడియార్ (చతుష్పది) పళమొళి నానూరు, ముఖ్య పెద్దగ్రంథములు మిగిలినవి చిన్న గ్రంథములు.

ఈ ముప్పైయారు గ్రంథములను గుఱించి వివరింతము. ఎట్టుత్తొకై (అష్టసంపుటముల) లో అకం (ప్రేమకావ్యము) నకు చెందినవి, కుఱుందొకై, నట్రిణై అకనానూరు, కలిత్తొకై, ఐంగురు నూరు, పరిపాడల్ అను ఆరు గ్రంథములుగలవు. పురం (ప్రేమేతరకావ్యము) నకు చెందినవి పురనానూరు పతిట్రుప్పత్తు అను రెండు గ్రంథములు. ఇందలి ప్రతి గ్రంథస్వరూపమును పరిశీలింతము.

## 1. కుఱుందొకై (హ్రస్వసంపుటము)

ఇందు నాల్గువందల పద్యములున్నవి. ప్రేమకావ్యము వివిధ కవివరుల చాటుపద్యరత్నములు. ద్విపదచందము నొప్పు 'ఆశిరియప్పా' లో పద్యములున్నవి. నాల్గు పాదములు మొదలుకొని ఎనిమిది పాదముల వరకుంగల పద్యము లిందున్నవి. ప్రతిపద్యమునకున్ను రచయిత పేరు, తిణై, తుఱై వివరణ, పద్యభావ స్పష్టతకై వచనములును గలవు. కపిలర్, భరణరు, ఔవ్వైయార్, మాంగుడి మరుదనార్, నక్కీరర్, పెరుంగడుక్కోన్ మొదలగు కవుల రచనలు కలవు.

## 2. నట్రిణై (శ్రేష్ఠాచారము)

ఇది కుఱుందొకై వంటిదే. కుఱుందొకైలో ఎనిమిది పాదములకు లోనున్న పద్యములే కలవు. నట్రిణై తొమ్మిది పాదములు మొదలుకొని పండ్రెండు పాదముల వరకుంగల పద్యముల సంపుటము. పదుమూడు పాదములకు పైగల పద్యములు అకనానూఱులో కలవు. పాద వ్యత్యాసములే కాని ఇదితర విషయములందు ఈ మూడు కృతులకు చాల పోలికలు కలవు.

## 3. అకనానూరు (ప్రేమపద్య చతుర్థశతి)

ఇది కుఱుందొకై; నట్రిణై వంటి నాల్గువందల పద్య రత్నములుగల గ్రంథము. పదుమూడు పాదములనుండి ముప్పై పాదములవరకుంగల పద్యము లిందు క్రోడీకరింపబడి

యున్నవి. కుఱుందొకై, నట్రిణై, అకనానూరు ఈ మూడు గ్రంథములనుపద్యపాదాకృతి ననుసరించి విభజించియున్నారు. మూడిటికి శైలి, భావము, కవుల వర్ణన, రచించిన కవులు ఇంచుమించుగా నొక్కటే యగును. అకనానూరు పద్య సంపుటము క్రోడీకరించుటయందు కొంత విశేషము కలదు. ఇందు మూడు విభాగములున్నవి. 1 నుండి 120 పద్యములు గల భాగమునకు కళిట్రియానై నిరై (మత్తగజపంక్తి) అనియు, 121 నుండి 300 వరకుంగల పద్యములు మణిమిడై పవళం (మణిప్రవాళము) అనియు 300 నుండి 400 వరకుం గలవి నిత్తిలకోవై (ముత్యాలహారము) అనియు పేరొకన బడును. బేసి పద్యములు (అనగా 1, 3, 5, 7 9, 11, 13, 15, 17, 19, 21 - ఇట్లు వచ్చు పద్యములు) అన్నియు పాలై (ఎడారి) పద్యములు. రెండు, ఎనిమిదియు (2, 8, 12, 18, 22, 28) వంటి పద్యములు, కుఱింజి (గిరిప్రాంత విహితములగు) పద్యములు. ఆఱవసంఖ్యగల పద్యముల (అనగా 6, 16, 26, 36) వంటివి మరుదం (నగరప్రాంత) పద్యములు. నాల్గవ సంఖ్యగల పద్యములు (అనగా 4, 14, 24, 34, వంటివి) ముల్లై (వనప్రాంతము), దశమ పద్యము లనగా 10, 20, 30 వంటివి నెయ్దల్ (సముద్ర తీర) పద్యములగును. ఈ విశేష విభజనవలన ప్రతి పద్యసంఖ్య తెలిసినవెంటనే "ఈసంఖ్యగల పద్యము ఈతిణై (పాలై, ముల్లై, కుఱింజి, నెయ్దల్ మరుదం - లో ఏతిణై) కు, చెందినదో స్పష్టముగా తెలుపవచ్చును. ఇట్టి విభజన కుఱుం

దొకై నట్రిన్నై లందు లేదు. అకనానూరు పద్యములు నాటకరంగ ప్రవేశములనదగి సొంపలరారుచున్నవి.

## 4. ఐంగుఱునూరు (హ్రస్వపద్యపంచశతి)

ప్రేమపద్యములు ఐదువందలుగల గ్రంథమిది. ఐదు విభాగములుగా నున్నవి. వాని వివరణ క్రిందచూడుడు.

| పేరు | పద్యసంఖ్య | కవి | శీర్షికసంఖ్య |
|---|---|---|---|
| 1. మరుదం | 100 | ఓరంబోహియార్ | 10 |
| 2. నెయ్దల్ | 100 | అమ్మూవనార్ | 10 |
| 8. కుఱింజి | 100 | కపిలర్ | 10 |
| 4. పాలై | 100 | ఓదలాందైయార్ | 10 |
| 5. ముల్లై | 100 | పేయనార్ | 10 |

ఇంకను ప్రతివిభాగమునందును పది పది పద్యములు గల పది ఉపవిభాగములు కలవు. వానికి శీర్షికలోనున్న పది పద్యభావములు సామ్యముకలవిగానున్నవి. కొన్ని శీర్షిక నామములను గమనింపుడు. ప్రార్థనదశకము, ఎంద్రశాయ దశకము. సఖికిచెప్పిన దశకము, జలక్రీడదశకము, మహిష దశకము, మర్కటదశకము, శుకదశకము, వసంతదశకము మొదలగునవి కొన్ని.

ప్రతిపద్యమునకును వివరణవాచకములున్నవి. చిన్న చిన్న పద్యములుగాను ఏకశీర్షికలో సమానభావముగల పది పది పద్యము లున్నందువలన చాల ఇంపుగానున్నవి. ఇది ధ్వనిగర్భితమైన పద్యరత్నరాశి యని చెప్పవచ్చును.

## 5. కలిత్తొగై (కలిపద్యసంపుటము)

కలిత్తొగై అనగా కలి పద్యసంపుటము అని అర్థము. కలి (கலி) అనగా తమిళపద్యవిశేషము. తెలుగు పద్యములు మాత్రాబద్ధములు అక్షరనియమములు కలవిగా ఉన్నవి. కాని తమిళపద్యములు మాత్రాబద్ధముగానూ అశై (அசை) అనబడు (Syllable) ఛందస్సులోని అంగనియమమునకు లోబడియున్నవి. అశై అనగా అక్షరములు గణరూపము పొందుటకు ముందున్న అవస్థ. ఇట్టి అశై ఏకాక్షరమువలన వచ్చునది అనియు ద్వ్యక్షరమువలన వచ్చునది అనియు ద్వివిధములుగనున్నది. ఈ అశైలు కలియుటవలనగణములు ఏర్పడును. వీనికిఒక అశై గణము, రెండు అశై గణము, మూడుఅశై గణము అని పేర్లిడియున్నారు. సూర్య, ఇంద్ర చంద్రగణ విభాగములు తమిళమున లేవు. ఈ గణముల పొందికనుబట్టి వెన్బా, (வெண்பா) ఆశిరియం, (ஆசிரியம்) వంజి (வஞ்சி) కలి (கலி) అని చతుర్విధపద్యములుగా విభజించియున్నారు. వెన్బా, కందపద్య పోలికకలది. ఆశిరియం మంజరి ద్విపద పోలికకలది; కలి సీసపద్య పోలికకలది. సీసపద్యముచివర తేటగీతి, ఆటవెలది చేరునట్లు కలి పద్యముల చివరను ఆశిరియప్పా చేరుచున్నది. వంజి ఆటవెలది పోలికకలది ఈ చతుర్విధ ఛందములనుండి జనించిన ఉపజాతులు [illegible]లాది కలవు. తమిళ పద్యములందు కలి పద్యముల వాడుక ప్రస్తుతము కనుపించుటలేదు. కాని పూర్వము మంచి పచారమునందుండినట్లు తెలియుచున్నది. ఇట్టి కలి పద్యగుచ్ఛమే

కలిత్తొగై. ఇందు 150 పద్యములున్నవి. ఇందు ఐదు విభాగములు కలవు.

| విభాగము | పద్యసంఖ్య | కవిపేరు |
|---|---|---|
| 1. పాలై | 36 | పెరుంగడుంగోన్ |
| 2. కురింజి | 29 | కపిలమహాకవి |
| 3. మరుదం | 35 | ఇళనాగన్ |
| 4. ముల్లై | 17 | చోడరాజు నల్లురుత్తిరన్ (రుద్రచోడరాజు) |
| 5. నెయ్దల్ | 33 | నల్లందువన్. |

కొందఱు పరిశోధకులు నల్లందువన్ అను కవికృతమే కలిత్తొగై పద్యములన్నియునని చెప్పుచున్నారు. కొందఱు ఏకకవికృతము కాదనియు పలువురు కవుల రచనలే అనియు కవుల పేరులు తెలియలేదనియు నుడువుచున్నారు.

కలిపద్యమునకు ఉపజాతిగావచ్చు తాళిశై (தாழிசை) సంస్కృత వృత్తముల పోలిక కలది. ద్విపదవృత్తము, త్రిపద వృత్తము, చతుష్పదవృత్తములు గలవు. కలిపద్యములం మధురముగా రసోచితశైలిలో నలరారుచుండును.

సంఘకాల సాహిత్యమున కలిత్తొగై రసజ్ఞుల హృదయమును చూఱగొనినది.

## 6. పరిపాడల్ (పరిపద్యములు)

పరిపాడల్ అనునవి ప్రాచీన గేయరచనలుగా తలచుచున్నారు. సంగీత శాస్త్రోక్తమైన గీతములివి. ప్రాచీనమైన

ద్రావిడ సంగీత సంప్రదాయము ప్రస్తుతము వాడుకలో లేదు. వానినిగురించి గ్రంథములద్వారా కొన్ని విశేషములు తెలియుచున్నవి. ఇట్టి గేయరచన సంపుటమే పరి (బగి) పద్యములు. ఈ పద్యములు 70 ఈ గ్రంథమున ఉండెను. కాని ప్రస్తుతము మనకు లభించినవి 24 పద్యములు మాత్రమే. ఇందు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, విష్ణువులను గురించిన పద్యములు 15, వైయైనదిని గురించిన పద్యములు 9 యు కలవు.

ప్రతి పద్యపు చివరను పద్యరాగ నామము గుర్తింపబడియున్నది. పద్యములు అతి దీర్ఘములుగానున్నవి.

## 7. పతిట్రిప్పత్తు (పదిపది పద్యములు)
## (దశ దశకములు)

అష్టసంపుట గ్రంథములందు పతిట్రిప్పత్తు, పురనానూరు అను ద్వివిధ గ్రంథములు బాహ్యజీవితమును వర్ణించుచున్నవి. తదితర షడ్గ్రంథములు ప్రేమజీవితమును వర్ణించుచున్నవి. ఈ ద్విగ్రంథములందు పతిట్రిప్పత్తులో పదికవీశ్వరులు పదిపది పద్యములచొప్పున చేరరాజులను వర్ణించిన విషయములున్నవి. ప్రస్తుతము మొదటి పది పద్యములును, తుది పది పద్యములును దొరకుట లేదు. తాళపత్ర గ్రంథమునందుండిన ఈ ప్రాచీనకృతిలోని మొదటి తుది పుటలు నాశమయ్యెనని తోచుచున్నది.

ప్రతి పద్యమునకును పద్యమందున్న వాక్యమొండు శీర్షిక నామముగానివ్వబడియున్నది. ప్రథమదశకం, ద్వితీయ దశకం, తృతీయదశకంబని గ్రంథము విభజింపబడియున్నది. ప్రతి దశకమునకు చివరను ఆశ్వాసాంత పద్యమురీతిని కవి పేరు, కృతిభర్త పేరు, వారు చేసిన గొప్పపనులు, వారిచ్చిన దాన శాసనాదులు వివరింపబడియున్నవి. ప్రస్తుతము లభించు ఎనిమిది దశకములందును ఎనభై పద్యములున్నవి. రాజ పారంపర్యము చేసిన దానవివరణ, కృతికర్త, కృతిభర్త, పేరులు మున్నగు వివరములు క్రిందచూపబడుచున్నవి.

| దశకము | కృతికర్త | కృతిభర్త | దానశాసనము |
|---|---|---|---|
| ద్వితీయ దశకం | కుమట్టూర్ కన్ననార్ | నెడుం జేర లాతన్ | ఉంబర్కాడు అనుచోట ఐదువందల ఊరులు మాన్యమిచ్చి, దక్షిణ దేశమునవచ్చు సుంకమందు ఒక భాగము ముప్ఫై ఎనిమిదేండ్లు ఇచ్చెను. |
| తృతీయ దశకం | పాలై గౌతమకవి | కుట్టువన్ | కవి ప్రార్థింపగా యజ్ఞము చేసి, కవి తన భార్యతోడ స్వర్గమునకు పోవుటకుపకరించెను. |

| దశకము | కృతికర్త | కృతిభర్త | దానశాసనము |
| --- | --- | --- | --- |
| చతుర్థ దశకం | కాప్పియాట్రు కాప్పియనార్ | నార్ముడి చ్చేరల్ | నలుబది లక్షల వరాహాముల బంగారమిచ్చి, తన పరిపాలనమున భాగమిచ్చెను. |
| పంచమ దశకం | పరణర్ | చెంగుట్టువన్ శిలప్పధికార (అందియకత) కావ్యకర్త 'ఇళంగో'వ అన్న) | 'ఉంబర్కాడు' అను ప్రదేశపు రాబడియు, తన కుమారుడు కుట్టువన్ చేరల్ అను వానినీ అప్పగించెను. |
| షష్ఠ దశకం | కాక్కై పాడినియార్ నచ్చెళ్లైయార్ (కవయిత్రి) | ఆడు కోట్పాట్టు చేరలాతన్ | భూషణములు తొడుగుకొనుమని తొమ్మిది 'కా' బంగారమును, లక్ష వరాహాములిచ్చి, తన ప్రక్క నుంచుకొనెను. (కా = తులము) |
| సప్తమ దశకం | కపిలకవి | శెల్వ క్కడుంగో వాళియాతన్ | లక్ష వరాహాము లిచ్చి 'నన్రా' అను కొండపై నెక్కి తన కంటికి నందిన ప్రదేశమెల్లను చూడి ఇచ్చెను. |

| దశకము | కృతికర్త | కృతిభర్త | దానశాసనము |
|---|---|---|---|
| అష్టమ దశకం | అరిశిల్ కిళార్ | పెరుంచేరల్ ఇరుంబొఱై | రాజు, భార్యతో కూడ బయటకువచ్చి "రాజభవనమున నున్నదంతయు కొనుము" అని చెప్పి తొమ్మిది లక్షల వరాహములతో రాజసింహాసనము కూడ నివ్వగా, కవి "నేను ప్రార్థింపగా, రాజ్యభారము నీవే వహింపుము" అని చెప్పి మంత్రిపదవినిం గైకొనెను. |
| నవమ దశకం | పెరుంగున్రూర్ కిళార్ | ఇళంచేరల్ ఇరుంబొఱై | ముప్పై రెండువేల వరాహములిచ్చి, కవి ఎఱుగకయే అతని ఊరు, ఇల్లు, తామరతంపరగా వైభవముతో పరిష్కరించేసి, ఎన్నరాని సంపదలనిచ్చి, ఇంకను పెక్కు దానములిచ్చెను. |

ప్రథమ, దశమ దశకములు లభింపలేదు.

## 8. పుఱనానూఱు (బాహ్య చతుర్ధశతి)

ప్రేమ జీవితముకాని తదితర బాహ్య విషయములను గుఱించి వ్రాయబడిన నాల్గునందల పద్యముల సంఘాట గ్రంథము. ప్రాచీన తమిళ రాజకీయ నాగరికత, సాంఘిక నైతిక జీవితవిధానము, ఆకాలపు రాజులు, వీరయోధులు, పతివ్రతాశిరోమణులు, దాతలు, కవివరులు మొదలగువారి జీవితములు ఈ గ్రంథమువలన విశదమగుచున్నవి. కపిల మహాకవి చరిత్ర ఈ గ్రంథమువలన మనకు తెలియు చున్నది. కపిల కవివరుని కీర్తించు పద్యములు కూడ ఇందు కలవు. కవులేకాక కవయిత్రులుకూడ కలరు. ఔవ్వైయార్, వారిలో నొకరు. ఈమె కవిత్వము చక్కగా నీతిబోధక ముగానున్నది. రాజదండమునకు వెఱవక, తమ నిష్పాక్షిక విమర్శవలన నీతి బోధించు కవివరులను, మార్గదర్శకులుగా వెలుగుచున్న లత్యపురుషులను ఈ గ్రంథమున చూచు చున్నాము. విశ్వసాహిత్యమున అద్వితీయమైన కృతులందు ఇదియొకటి.

## దశగీతము (పత్తుప్పాట్టు)

దశగీతము ఏకగ్రంథముగానున్నను దశగ్రంథ సంపుటము.

ఇది తమిళ కావ్యములు రూపొందుటకు ముందుండిన ఖండ కావ్య సంపుటమన తగియున్నది. ఈ గ్రంథము, అష్టసంపుట ములవలె పద్యసంపుటముకాదు. ఖండకావ్య సంపుటము.

| గ్రంథము | — | కవి |
|---|---|---|
| 1. తిరుమురుకాట్రుప్పడై (శ్రీ సుబ్రహ్మణ్యస్వామి మార్గదర్శకము) | | ...నక్కీరనార్ |
| 2. పొరునరాట్రుప్పడై (నటమార్గదర్శకము) | | ...ముడత్తా కణ్ణియార్ |
| 3. చిఱుపాణాట్రుప్పడై (చినగాయకమార్గదర్శకం) | | ...నత్తత్తనార్ |
| 4. పెరుంబాణాట్రుప్పడై (పెదగాయకమార్గదర్శకం) | | ...రుద్రంగణ్ణనార్ |
| 5. ముల్లైప్పాట్టు (వనగీతము) | | ...నప్పూతనార్ |
| 6. మదురైక్కాంజి (మధురాపురి రక్షణ) | | ...మాంగుడి మరుదనార్ |
| 7. నెడునల్వాడై (పెద కరువలి) | | ...నక్కీరనార్ |
| 8. కుఱింజిప్పాట్టు (శైలగీతము) | | ...కపిలమహాకవి |
| 9. పట్టినప్పాలై (నగరగీతము) | | ...రుద్రంగణ్ణనార్ |
| 10. మలైపడుకడాం (శైలమధుపాతం) | | ...కౌశికనార్ |

దశగీతములందున్న ఎనిమిదవ ఖండకావ్యమగు కుఱింజిప్పాట్టు అను కృతి తెనిగింపు ఈ శైలగీతము.

## ద్వితీయ అష్టాదశకృతులు

ఇవి పదునెనిమిది గ్రంథములు. ఇందు ముఖ్యమైన గ్రంథము తిరుక్కుఱళ్. ఇది ధర్మార్థకామములనుగురించిన నీతిపద్యములతో గూడినది. తిరువళ్లువర్ అను మహాకవి రచించెను. విశ్వసాహిత్యమున పేరెన్నికకన్న గ్రంథము. విశ్వభాషలందెల్ల అనువదింపబడినది. ఈగ్రంథప్రశస్తి ఎంత చెప్పినను చాలదు. తెనుగున ఐదారు అనువాదములున్నవి.

ఈ గ్రంథముల పట్టి చూడుడు.

| గ్రంథనామము | | కృతికర్త | | పద్యసంఖ్య |
|---|---|---|---|---|
| 1. నాలడియార్ | ... | జైనఋషులు | ... | 400 |
| 2. నాన్మణిక్కడికై | ... | విళంబినాగనార్ | ... | 100 |
| 3. ఇన్నానార్పదు | ... | కపిలమహాకవి | ... | 40 |
| 4. ఇనియవై నార్పదు | ... | పూదంచేందనార్ | ... | 40 |
| 5. కార్ నార్పదు | ... | కణ్ణంగూత్తనార్ | ... | 40 |
| 6. కళవళినార్పదు | ... | పొయ్గైయార్ | ... | 40 |
| 7. ఐందిణై ఐంబదు | ... | పొఱైయనార్ | ... | 50 |
| 8. ఐందిణై ఎళుపదు | ... | మూవాదియార్ | ... | 70 |

| గ్రంథనామము | కృతికర్త | పద్యసంఖ్య |
|---|---|---|
| 9. తినై మొళిఐంబదు | ... కణ్ణంబూతనార్ | ... 50 |
| 10. తినైమాలై నూట్రైంబదు | ... కణిమేదావియార్ | ... 150 |
| 11. ముప్పాల్ (తిరుక్కుఱళ్) | ... తిరువళ్ళువర్ | ... 1330 |
| 12. తిరికడుకం | ... నల్లాదనార్ | ... 100 |
| 13. ఆచారక్కోవై | ... ముళ్ళియార్ | ... 100 |
| 14. పళమొళి | ... మున్రురై అరైయనార్ | ... 400 |
| 15. చిఱుపంచమూలం | ... మాక్కారియాసాన్ | ... 100 |
| 16. ముదుమొళికాంజి | ... కూడలూర్ కిళార్ | ... 100 |
| 17. ఏలాది | ... కణిమేదావియార్ | ... 80 |
| 18. కైన్నిలై | ... పుల్లంగాడనార్ | ... 60 |

ఈ గ్రంథములను గుఱించి గ్రంథవిస్తరభీతిచే విపులముగా వ్రాయబడలేదు. ఇంతవరకు నుడివిన ప్రథమాష్టాదశకృతులగు అష్టసంపుటములు దశగీతములును, ద్వితీయాష్టాదశకృతులును తమిళభాషలోని ప్రాచీన సాహిత్యములు. ఇవిగాక తమిళ పంచకావ్యములు ఉన్నవి. వీని ఇతివృత్తము స్వతంత్రమైనది. తమిళదేశ జీవితమును ప్రతిబింబించు కావ్యములు. ఇవి జైన, బౌద్ధ కావ్యములుగా నున్నవి.

## తమిళ పంచకావ్యములు

శిలప్పదికారం, మణిమేఖల, జీవకచింతామణి, వళై యాపతి, కుండలకేశి అను ఐదును తమిళ పంచకావ్యములు. ఇందు వళైయాపతి, కుండలకేశి అను రెండు బౌద్ధకావ్యములు లభించలేదు. వళైయాపతిలో వందపద్యములు కుండల కేశిలో పది పద్యములు మాత్రమే దొరకినవి. మిగత మూడు కావ్యములనుగుఱించి కొంత పరిశీలింతము.

## శిలప్పదికారం (అందియకథ)

ఇది క్రీస్తుశకం ఐదవశతాబ్దమున కలిగిన కృతిఅనియు, రెండవ శతాబ్దపుకృతిఅనియు భిన్నాభిప్రాయములున్నవి. దీనిని చేరన్ చెంగుట్టవన్ అను రాజుయొక్క తమ్ముడైన ఇళంగో రచించెను. యువరాజగు ఇతడు జైన మునీశ్వరుడయ్యెను. మణిమేఖల కావ్యకర్తయగు శాత్తనార్ చెప్పిన కథను పుర స్కరించుకొని తన కావ్యరాజమును నిర్మించెను. మధురపద శైలిలో కవిత్వము అలరారుచున్నది. ఇందలి ఇతివృత్తము దుఃఖాంతనాటికవలెనున్నది. చోడరాజ్యమునసిరిసంపదలతో తులదూగిన కోవలన్ అను వైశ్యుడు భార్యయగు కన్నకిని, విడిచి మాధవి అను వేశ్యాలలామతో కూడి దారిద్ర్యము పాలగుచున్నాడు. పిదప వేశ్యనువీడి కన్నకితో కూడ పాండ్య రాజనగరమైన మధురకు వచ్చెను.

భార్య కాలి అందియలనమ్మి మూలధనముగానుంచి బేరము చేయ నుద్దేశించి వచ్చెను. పాండ్యరాజు భార్య

యొక్క అందియ పూర్వము దొంగలింపబడినందున కోవలన్ తాను స్వమంజీరమును అమ్మచూపగా రాజభటులచే, వీడే దొంగ అనియు, ఈ అందియ రాజపత్నిదే అనియు తలచి హత్యచేయబడెను. పతివ్రతయగు కన్నకి భర్తృవియోగము సహింపక భర్త చోరుడుకాడని నిరూపించుటకు తన మఱియొక అందియను చేతబట్టుకొని రాజసభకేగి రాజుతో వాదులాడి, అందియ తనదేఅని నిరూపించి, భర్త చోరుడు కాడని వ్యక్తపరచెను. నీతితప్పినరాజు అప్పుడే మరణించెను. రాణియు మరణించెను. కోపితురాలైన కన్నకి మధురాపురిని శాపముచే కాల్చెను. పిదప దివికేగెను.

ఈకథ రెండు కాండముల కవి వర్ణించెను. ఈ గ్రంథమున త్రికాండములు కలవు. మూడవకాండమున కవి, తన అన్నయగు చేరరాజు చెంగుట్టువన్ వీరపత్నియగు కన్నకి విగ్రహము కల్పించి గుడి కట్టించిన వృత్తాంతమును వర్ణించినాడు. ఈ కాండమున చారిత్రకాంశముల కలవు. కవి స్వవిషయములుకూడ ఇందు చెప్పుకొనెను. ఈ గ్రంథము పూతలపట్టు (శ్రీ) రాములు రెడ్డిగారిచే తెనిగింపబడి ప్రచురింపబడియున్నది.

## మణిమేఖలై

ఈ గ్రంథము పూర్వోక్త గ్రంథ శేషమువలె కనిపించును. కోవలన్ వేశ్యయగు మాధవితో కూడియుండినప్పుడు మణిమేఖల అను కుమార్తె జనించెను. ఈమె కోవలన్-కన్నకిల మరణానంతరము బౌద్ధమతమును అవలంబించినది.

తల్లి, కూతురులిరువురు భిక్షుకులైరి. మణిమేఖల చోడయువ రాజు ప్రేమను త్యజించి, బౌద్ధధర్మ ప్రచారము చేసినయువతి. విశ్వమంతయు ఆకలిమంటలు లేక శాంతియుతముగా నుండ వలెననుట ఈమె లక్ష్యము. ఎన్నో కష్టనష్టములు వచ్చినను దీక్ష విడువని ధీరురాలు. అక్షయపాత్రము చేతబట్టుకొని భువి యెల్ల తిరిగి క్షుద్బాధ తీర్చినది. తత్త్వబోధామృతము నిచ్చిన ధన్యురాలు. ఈమె చరిత్ర నీతిబోధకము. విశ్వ సాహిత్యమందు ఈమెవంటి అత్యుత్తమ నారీమణి, త్యాగ శీలి వేఱొక్కడను కనిపించదు అనిన అతిశయోక్తి కానేరదు.

మణిమేఖల కావ్యకర్త శాత్తనార్ అను మహాకవి. తత్త్వజ్ఞాని. బౌద్ధధర్మావలంబి. ఈకృతి శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారిచే తెనిగింపబడి ప్రచురింపబడియున్నది. కావున విపులముగా వ్రాయలేదు. ఆంధ్రులెల్లరు ఈ కావ్య రాజమును పఠింతురుగాక.

## జీవకచింతామణి

తిరుత్తక్కదేవర్ అను జైనకవి రచించిన కృతియిది. ఈగ్రంథము తమిళమున వృత్తఛదస్సులోని తొలికృతి. మణిమేఖల ద్విపదఛందస్సులో(ఆశిరియప్పా)వ్రాయబడినది. శిలప్పధికారము నట్లే.

ఇందలి ఇతివృత్తము జైన తీర్థంకరుల చరిత్రయగు "శ్రీ పురాణము" అను కృతినుండి కైగొనబడెను. ఇందలి

జీవకనికథ, గుణాఢ్యుని బృహత్కథలోని ఉదయనుని కథ లను బోలియున్నది.

జీవకుడనురాజు పది పడతులను పరిణయమాడిన కథ లిందున్నవి. ఈ గ్రంథము విస్తారమైనది. కథాసంగ్రహము గ్రంథవిస్తర భీతిచే ఇందు వ్రాయలేదు.

ఇంతవరకు తమిళ ప్రాచీన సాహిత్యమైన "సంఘ కాల సాహిత్యము" లను గుఱించి తెలిసికొంటిమి. అర్వాచీన కవులనుగుఱించి తెలుపుటకు ప్రత్యేక గ్రంథమే వ్రాయ వలసియుండును. కావున ఇంతటితో విరమించెదను. ఇక, సంఘకాల సాహిత్యమున కవి చక్రవర్తియగు కపిలమహా కవియొక్క శైలగీతమును చెవులార వినదముగాక.

## కపిలమహాకవి చరిత్ర

క్రీస్తు శకము మొదటి శతాబ్దములో వెలసిన అతి ప్రాచీనమైన తమిళసాహిత్యములో అగ్రగణ్య మహాకవిగా ప్రజ్వలించువాడు కపిల మహాకవి. ఆనాడు తమిళ దేశము చాల వైభవముతో విరాజిల్లి స్వర్ణయుగముగా నుండెడిది. చేర చోడ పాండ్యులను ముగ్గురు రాజులు పరిపాలించు చుండిరి. మధ్యమధ్యలో చిన్నచిన్న రాజులుకూడ స్వతంత్ర ముగా కొంత ప్రాంతమును పాలించుచు వచ్చిరి. ఈ రాజు లందఱి గౌరవమునకు పాత్రుడై మెలగి తన కవిత్వముచే తమిళ ప్రజానీకమును తనియింపజేసి కృతార్థుడైన ధన్యజీవి కపిలుడు. అతని కవిత్వము మృదుమధుర పదలాలిత్యముతో

విరాజిల్లుచు, భావోద్రేక పూరితమై, నవరసాలంకారమయ ముగానున్నది. అతని రచనలందెక్కువ చాటుపద్యములే, తన్నాదరించిన రాజులను గుఱించి చెప్పిన పద్యములేగాక, ప్రేమజీవితమునుగుఱించిన సంభోగ శృంగార రసపూరితము లైనపద్యములుకూడ ఎక్కువగానున్నవి. అతని కావ్యప్రబంధము తెలియకున్నదిగాని యొక్కటే. తదితర కవితలన్నియు పూర్వులచే క్రోడీకరింపబడిన "ఎట్టుత్తొగై" (అష్టసంపుటముల) లో నున్న ఎనిమిది ఉద్గ్రంథములందున్నవి. క్రీస్తు అనంతరము నాలుగు లేదా ఐదవశతాబ్దమునందే యీ గ్రంథములు కలిగి యుండవలెను. కావున, కపిలమహాకవి రచించిన వేన వేలు పద్యములందు మనకు లభించినవి తక్కువే. అతని మరణానంతరము రెండుమూడు శతాబ్దముల తర్వాతనే యీ పద్యములు ఏర్చి "ఎట్టుత్తొగై" గ్రంథములందు చేర్పబడిలభించుచున్నవి. ఈ గ్రంథములందున్న కపిలమహాకవి యొక్క పద్యములనుండియే అతని చరిత్రాంశములు మనకు దొరకుచున్నవి. కర్ణపరంపరాగతమైన కథలను విడిచి యీ చరిత్రాంశములనుబట్టియే అతని చరిత్రను మన మెఱుగం గలము. ఇతని చరిత్ర కుపకరించు అతనిచే రచియింపబడిన పద్యములు, తమిళకవుల చరిత్ర గాథలు, తిరుక్కోవలూరు, వీరట్టానేశ్వరగుడి శిలాశాసనము మొదలగు విషయము లన్నియు ఇందు చూపబడలేదు. కావున అతని సంక్షిప్త చరిత్రను మాత్రమే చదువరులకు తెలియజేయుడమైనది.

తమిళదేశమున పాండ్యరాజుల ముఖ్యపట్టణమైన మధురకు ప్రక్కన కపిలమహాకవి జనించెను. అతడు

బ్రాహ్మణుడు. తమిళమందును, సంస్కృత భాషలోను పాండిత్యము గడించెను. కవితా రచనలో నాతి తేలెను, మధురరాజుల మన్ననకు పాత్రుడయ్యెను.

ఆనాటి కవులు నిరంకుశప్రతిభ కలిగియుండిరి. రాజాశ్రయము పొందినప్పటికిని తమ భావ స్వాతంత్ర్యమును విడిచిన వారుకారు. కొన్ని సమయములందు రాజులకు హితబోధ చేయునప్పుడు జంకు గొంకు లేక సూటిగాను, మృదుమధుర వచోనైపుణ్యముతోను కవిత్వము చెప్పుచుండిరి. రాజులును ప్రజలును కవులను గౌరవించిరి. కవిసార్వభౌముడై కపిలకవి మధురరాజుల నాశ్రయించి కొంత కాలముండెను. ఆతరువాత పారి అను రాజు నాశ్రయించెను. పారి గొప్పదాత. అడిగినవారికి లేదనక పంపువాడు కాడు.

కర్ణునివలెనే వచ్చినవారికెల్ల నిచ్చినవాడు. పారిరాజు ఒకనాడు ప్రక్కనున్న అడవులకు వనవిహారమునకుపోయెను. అక్కడ ఒకచోట తన కనకరథమును విడిచి కాలినడకనే నవతిలకేగి ప్రకృతి సౌందర్యముల వీక్షించుచుండెను. ముగ్ధమానసుడైన అతడు తిరిగివచ్చి తన రథమును చూచునప్పుడు రథచక్రములను ఒక మొల్లతీగ పాకులాడుచు చుట్టుకొని పెనవేసికొనియుండెను. లతాశ్రయమైన తన రథమును కరుణాహృదయుడైన పారిరాజు వేఱుచేయలేదు. సదయ హృదయుడై విడిచిపెట్టి కాలినడకతోనే పురమునకు వచ్చెను. పురజనులు ఈ వృత్తాంతమునువిని చకితులైరి. పారియొక్క కీర్తి జగమంతట వ్యాపించెను. కపిలకవి యీ వృత్తాంతమును తన కవితలో వర్ణించి మోదమందెను.

పేకన్ అను ఇంకొక దాతయుండెను, అతడు "పళని" ప్రాంతమును పాలించెను. ఇతడొకనాడు చలికాలమున వేకువ ఒక నెమలి పురివిప్పియాడుట చూచెను. ఇతని దయామయహృదయమున ఆ మయూరము చలిచేత వడంకు నట్లు తోచెను. వెంటనే తనవద్దనున్న అమూల్య రత్నఖచి తంబైన పైడి శాలువను తీసి నెమలికి కప్పివైచెను. ఇట్టి యావజ్జీవకారుణ్య చిత్తుడైన రాజు నాశ్రయించి కపిలకవి అతని ఆస్థానమునకు పోయెను. అపుడు పేకన్ తన భార్య యగు 'కన్నగి' అను పడతిని ప్రియరహితుడై విడిచిపెట్టి యుండెను. ఆమెను చూడనైన పోవుట మానివేసెను. తన్ను భర్త త్యజించినందున ఆమె కన్నీరు మున్నీరుగా ఏడ్చుచుండెను. ఈ దృశ్యమును కపిలకవి గాంచెను. ఆమె దీనస్థితికి జాలిపొందెను. రాజుకు హితబోధ చెప్ప ధైర్య మెవరికి కలదు? కాని కపిలకవి రాజువద్ద ధైర్యముతో అతని అనీతివర్తనను ఎత్తిచూపి వియోగపరితప్తయైన ఆమెను క్షమించి ఎప్పటివలెనే ఆదరింపవలయునని చెప్పెను. కవి హితబోధలచే తెలివిగొన్న రాజు భార్యను స్వీక రించెను.

పిదప కపిలకవి 'మలయమాన్ తిరుముడి కారి' అను రాజువద్దకు చనెను. అతడు కపిల కవివరుని గౌరవించెను. కాని బహుమతులేవియు నంతగా నియలేదు. అందుకు కారణము బహుమతులిచ్చిన కపిలకవి తన్ను విడిచి వేరొక చోటికేగునేమో? అని సంశయించెను. కాని కపిలకవికి అతని చర్య నచ్చలేదు. తనయొక్క గొప్పతనమును

గుర్తించలేదని రాజుపై కోపించి ఒక పద్యము వ్రాసెను. రాజు దానికి సంతోషించెనే కాని కోపించలేదు. వెంటనే అతనికి ధనధాన్యవస్తువాహనాదిసత్కారములిచ్చి పంపెను. కపిలకవివరునకు ప్రహస్తుడను ఆర్యరాజు స్నేహితుడయ్యెను. ఆ రాజు ఉత్తరదేశమునుండి వచ్చినవాడు. తమిళ సాహిత్యముల ప్రాశస్త్యమును విని సాహిత్యాభిలాషి యయ్యెను. అతని కోరిక ప్రకారము "శైలగీతము" అను చిన్న ప్రబంధమును రచించి కపిలకవి కృతార్థుడయ్యెను. ఆ తరువాత మరల పారిరాజువద్దకు చేరెను.

పారియు కపిలకవియు సన్నిహిత మిత్రులైరి, సుఖదుఃఖములందు పాల్గొని భోజకాళిదాసులవలె విరాటధర్మరాజులవలె నుండిరి.

ఇట్లుండ చేర చోళ పాండ్యరాజులు ముగ్గురును పారిరాజుపైన ఈర్ష్యాబద్ధులైరి. అతని దిగంతవ్యాపిత కీర్తి వారికి కన్నెఱ్ఱజేసినది. నిష్కారణముగ దండెత్తినారు. కపిలకవి వారి ముగ్గురనుచూసి "ఓ రాజులారా! మీ మగటిమి చూపిన పారిరాజు దేశము మీపాలగునని కలనైన తలపకుడు. వాని దేశమున వెదురుబియ్యము, పనసపండ్లు, గెనుసుగడ్డలు, కొండతేనె అను నాలుగు ఆహారవస్తువులు సమృద్ధిగనున్నవి. మింటిచుక్కలెన్నిగలవో అన్ని సొనలు అందున్నవి. సొనల చుట్టునున్న ప్రతి వృక్షమూలమునందును మత్తేభములను కట్టి ముట్టడించినను వాని దేశమును కైవసమొనర్చుకొనుటరుదు. మీ ప్రయత్నముచే అది దొరకదు. మీఖడ్గమునకు వెఱచి అతడు ఇచ్చువాడు కాడు. కాని

మీకు వాని దేశమును గైకొనవలయునను దురాశ యున్నచో నేనొక దారి చెప్పెదను. మీరు ఖడ్గములను పాఱవైచి, చేత వీణెలను కైగొని, మీ పత్నులు వెంటరాగా నతని కీర్తిని బాడు గాయకులై వచ్చినచో తప్పక తన రాజ్య మంతయు మీకొప్పగించును.''

ఆమాటవిన్న రాజులకు కడుపుమంట ఎక్కువాయెను. పారిరాజు దేశమును ముట్టడించిరి. బహుదినము లాయెను. కాని పారి వారికి వెఱవక యుద్ధముచేసెను. కపిల కవి ఈ ముట్టడివల్ల పురములోపలి జనులకు ఆహారసమస్య హెచ్చగుట గుర్తించినాడు. ఒక తంత్రము పన్నెను. వేన వేలు చిలుకలకు అభ్యాసమిచ్చినాడు. ఆ చిలుకలు కోట దాటి ఎగిరిపోయి మాగాణులందున్న వరిగింజల నేఱుకొనివచ్చి నింపెను. అందువల్ల ఆహారసమస్య పరిష్కరింపబడెను.

ముగ్గురురాజులును విసుగెత్తిపోయిరి. న్యాయ యుద్ధ మసాధ్యమని గుర్తించినారు. కపటముగా పురములోపలికి వెళ్లి పారిరాజును హఠాత్తుగా పొడిచి చంపినారు. ఈదుఃఖ మునుభరింపలేక కపిలకవి విలపించెను. వెంటనే తానుకూడ చావవలెననుకొనెను. ప్రియమిత్రుని దుర్మరణము అతని హృదయమునుకలచివైచినది. విరక్తిపొందినాడు. పారిరాజుకు పెండ్లి కాని యిరువురు పుత్రికలుండిరి. వారికి పెండ్లిగావించు భారము తనపై పడినదని తలంచెను. వెంటనే దుఃఖాశ్రు పూరితనయనలై సౌందర్యగనులైన ఆ పుత్తడిబొమ్మ లను తోడ్కొని కోటవిడిచి బయలుదేరెను. తమిళ దేశమం

కటను తిరిగి తగిన వరాన్వేషణ చేసెను. పాండ్యరాజులతో పగవచ్చునని జంకి చిన్న చిన్న రాజులు పెండ్లికి ఒప్పుకొనరైరి. తుదకు ఒక బ్రాహ్మణకుటుంబమున వారిరువురను ఒప్పగించి తాను మాత్రము చేర దేశము (కేరళము) పోయెను. అక్కడ "సెల్వక్కడుంగో వాళియాతన్" అను రాజు ప్రాశయించెను. అతని కంకితముగా కొన్ని పద్యములు రచించెను. కవులపాలిటి కల్పతరువైన ఆ రాజు కపిలమహాకవిని గౌరవించెను. లక్షవరాహముల బంగారము విరాళమిచ్చి, "నన్రా" అను తిప్పపై నెక్కి నిలిచి తనకంటి కగపడు ప్రదేశమంతయు నతని యధీనము చేసెను. ఇంత గొప్పసంపద నందినపిమ్మట నాసిని తనప్రియమిత్రుడైన పారిరాజు కూతుళ్ళకిచ్చి 'తిరుక్కోవలూరు' రాజునకు పెండ్లిగావించెను. తన కర్తవ్యము నెఱవేఱినపిమ్మట కపిలమహాకవి వైరాగ్యము నొంది ప్రాయోపవేశము చేసి, ఆహారాదులను మాని మరణదీక్షవహించి దివంగతుడయ్యెను. ఈకవి చరిత్రలో కాల్పనికాంశములేవియు లేవు. అతని సాహిత్యాధారములును, శిలాశాసనాదులును గలవు. చిరస్మరణీయుడైన కపిలకవి స్నేహభావము, కర్తవ్యనిర్వహణ, రాజనీతి కుశలత, వాక్చాతుర్యము, వైరాగ్యచిత్తము, నిరంకుశ కవితాధార, సౌశీల్యాది సుగుణసంపద అన్నియు పాఠకుల హృదయము నాకర్షింపక మానవు. క్రీస్తుశకము మొదటి శతాబ్దమున వెలసిన యీకవివరుని చాటుపద్యములందున్న భావగాంభీర్యమును కావ్యమాధుర్యమును గ్రోలి సారస్వత రసికులు తమిళ సాహిత్య పరిచయము కలిగించుకొన ప్రయత్నింతురుగాక!

## శైలగీతము — వచనరచన

[చెలికత్తె నాయికతల్లితో నాయికప్రేమ వృత్తాంతము చెప్పి తన కర్తవ్యము నెరవేర్చుచున్నది. చెలికత్తె మాటలే యీ కావ్యరూపమును పొందియున్నవి.]

తల్లీ ! నీకు శుభమస్తు. నేను చెప్పబోవు విషయములను ఓర్పుతో వినుము. నాసఖి (నాయిక) మదనవికారమును జూచి, నీవు వ్యాధియనుకొని, ఎఱుకలసాని నడిగి సోదె చెప్పించుకొని దుఃఖించుచున్నావు. నాయికయు తన మనోవ్యథను పైకి చెప్పలేక లోలోన అణచుకొని దుఃఖించుచున్నది.

''మణులు పొదిగిన సొమ్ములు చెడినచో తిరిగి సరిచేయవచ్చును కాని కులశీలములు చెడినచో తిరిగి సరిచేసికొనలేముగదాయనియు'' తండ్రి అనుమాజ్ఞలను మీఱినేను నాయకుడును కలిసికొన్న (గాంధర్వవివాహము చేసికొన్న) విషయమును తలితండ్రులకు చెప్పిన ఏమి ఆపద వచ్చునో? నిందకలుగునో? వంశప్రతిష్ఠకు మచ్చ కలుగునేమో? అనియు, తలిదండ్రులు ఇష్టపడకున్నచో పునర్జన్మలోనైన పరస్పరసంబంధము కలుగుగాక, ఆ జన్మాంతము దుఃఖతురాలనై యుందుగాత యని విలపించుచున్నది. తల్లి కూతుళ్ల ఇద్దఱిమధ్యలో రాజులమధ్యలో సంధిగావించు దూతునివలె నేను ధర్మసందేహములో నున్నదానను. కుల శీలములు, భాగ్యము, వంశ చరిత్రాదులనెల్ల నరయక మాలో మేముగా ప్రయత్నించి జరిపిన యీ గాంధర్వవివా

కాము జరిగిన విధమును సవిస్తరముగా విన్నవించెదను. కోపింపక ఆలకింపుడు.

ఒకనాడు నీవు మమ్ములజూచి "కొఱ్ఱచేనులో ప్రాలు పులుగులను ద్రోలి సాయంకాలము రమ్ము" అని చెప్పి పంపితివిగదా! అట్లే మేముపోయి కొఱ్ఱచేనిలో మంచెపై నుండి ఒడిసెలతో పిట్టలనుద్రోలి, ఎండతాపము నోర్వజాలక సెలయేట జలకమాడి, ఆడుకొనుచు, పూలుకోయుచు, పూల హారముల నలంకరించుకొనుచుంటిమి. అప్పుడు నాయకుడు వచ్చెను అతడు కిల్లు అమ్ములతో మాఁదునిలిచి "నేను వేటాడవచ్చి దారితప్పితిని. తెలిసిన చెప్పుడు" అనెను అతని ప్రశ్నకు ప్రత్యుత్తరమీయక ఊరకుంటిమి. అంత నాయకుఁడు "అడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తర మీయరాదా? అందువలన నిందకలుగునా?" అనిచెప్పి, ఒక పూగొమ్మ విరిచి చుట్టుకున్న కుక్కలంబోలి మా మాట నెదురుచూచు చుండెను.

అప్పుడు ఎదురుచూడని విధముగా వనచరులచే బెదరింపబడిన ఒక ఏనుగు మ్రాకులను గూల్చుచు, తొండము చాచుచు భయంకర ఘీంకారముచేయుచు మా చేరువకు వచ్చెను. అంత మేము భయకంపితచేతస్కులమై దిక్కుగానక, సిగ్గువిడిచి ఆ నాయకుని శరణుజొచ్చితిమి. ఆ వీర నాయకుడు విల్లెక్కుపెట్టి ఒక బాణమును ఆ ఏనుగు మోమున నేయగా, భోరన రక్తధారలు కార నది పరుగిడెను. ఇంకను వణకుచున్న మమ్ములజూచి నాయకుడు ఓదార్చెను. నాయికనుజూచి "మగువా! వెఱవకుము.

నిన్ను స్వీకరింతును. నిన్ను విడిచిపోదునని భయపడకుము. అని చెప్పి తన హృదయభావము వెల్లడించెను. నాయకుడు నన్ను జూచి చిరునగవొలయ ప్రార్థించెను. నాయకుడు నాయికను కౌగలించి సహజ భయవ్రీడాన్వితయై నాయిక విడిపించుకోజూచినను గాఢానురాగముతో గాఢాలింగనమున నాయకుడుబంధించెను. మఱియు ఆమెగ్రహస్థజీవితమును కోరుచున్నదని భావించి "అతిథులు తినగా మిగిలిన భోజనము నీవు వడ్డింపగా నేను భుజింతునుగాత" అని చెప్పి కుమారస్వామికి మ్రొక్కి శపథము చేసెను. నాయిక ఆదినమంతయు అతనితో కూడియుండెను. సూర్యుడస్తమింపగా నాయకుడు ఆమెనుజూచి, "మీ తలిదండ్రులు చేయిపట్టియివ్వగా ఎల్లరు ఎఱుగునట్లు నిన్ను చేపట్టుదును. కొంతకాలము వేచియుండుము" అని ప్రియోక్తులు పలికి, మాతోడుగా మా ఊరు నీటిరేవువఱకు వచ్చి మమ్ము దిగవిడిచి మరలెను.

ఆనాటినుండి అతడు ఈమెను ప్రతిరాత్రియు వచ్చి కూడిపోవుచుండును. అతడు వచ్చు సమయమునకు తలవరులు వచ్చినను కుక్కలు మొఱిగినను, నీవు మేలుకొనియున్నను, వెన్నెలకాసినను, ఈమెను చూడకయే తిరిగిపోవును. మేము సంకేతస్థలమునకు పోలేకపోయినను అతడు మరలిపోవును. కాని ఇసుమంతయు విసుగుచెందడు. ఎట్టి అంతరాయములు కలిగినను నాయికయందు అతడు ఎప్పటివలెనే గాఢానురాగముతో నుండును. రూపసంపన్నుడు, యువకుడు, సత్యపరిపాలకుడు, కులాచారములు మీఱనివాడు, సిరిసంపదలందు దులదూగెడువాడు. కావున వానికే యీామెనిచ్చి పెండ్లి

చేయింపుము. నాయికయు ఈ గూఢవృత్తి బయటపడు నేమోయనియు, నాయకుడు వచ్చుదారిలో కలుగు ఆపదలను తలచుచు దిగులుతో వగనొంది వీక్షించుచుండును. కావున పరస్పరానురాగ చిత్తులైన నాయికానాయకుల వృత్తాంతము తెలిపితిని. వారికి పెండ్లి చేయించి దీవింతువు గాక! ఇక నీదే భారము"

## శైలగీతము

**మంజరీద్విపద**

[చెలికత్తె నాయిక తల్లికి ప్రేమికుల వృత్తాంతమును తెలుపుచున్నది]

అమ్మరో! శుభమస్తు నెమ్మదిః వినుము!
క్రొమ్మెఱుఁగునుదురు క్రొక్కారు గురులుఁ
గలవాడు చెలిమేనిఁ గలభూషణములఁ
దొలఁగించి నటువంటి తొలఁగని వ్యాధి
నెఱుకలసానితో నెఱుఁగంగ నడిగి
పూవులుం దావులుం బొలుపొందనిచ్చి
బహువిధ రూపియౌ భగవంతుఁ గొలిచి
చలువచందనమిడి సౌరభ మిచ్చి
ఫలములేనందునఁ బలుమాఱు పొగిలి
తీరని వగలచేఁ దెలియక నీవు
నుందువు మఱియు నీ యువిదయు మేల్మి
యందము చెడిపోయి యందఱునెఱుఁగఁ

గుందుచుꠀ జిక్కుచుꠀ గ్రొత్తగాఁదోఁచు
విరహవేదనలచే విహ్వలయౌచుఁ
జిత్తచాంచల్యంబుఁ జెందుచునుందు
అత్తటి నే బల్కి నడుగ నిట్లనును.

[నాయిక పలుకులు]

"పుత్తడి ముత్తెమ్ము పొలుపైన మణుల
నుత్తమముగఁజేయ నొప్పారు నగలు
చెడినచో మఱిదిద్ది చేయంగ వచ్చు
శీలగౌరవనియమాలు పాడయిన
మాలిన్యముకడిగి క్రాలు వన్నియలు
నెలకొని చేయుట నిర్మలులకును
సులభము కాదంద్రు శూరులుగాన,
కట్టడ, నాయొక్క కన్నెఱికంబు
పాడయిపోవగా బహురథుఁడైన
మాతండ్రి చెఱపీడి మంతనంబాడి
యిద్దఱుంగైకొన్న యింపగుపెండ్లి
యిదియని తెల్పిన ఎగ్గగునొక్క !
మార్గమొప్పకయున్న మహిఁదాల్మి నుండ
స్వర్గములోనైన సంపర్క మగుత"
అనిపల్కి కనుగవ లలమట చెంద
కనికరమున వగఁ గలఁగుచునుండి
దుర్భర వేదనꠀ దుఃఖించుచుఁగడుఁ
జిక్కుచునున్నది చెలియ యిప్పగిది.

[చెలికత్తె స్థితి]

పగగొని జగడాల పాల్గొనిరువురు
మగటిమి రాజుల మధ్యలో సంధి
పొందించు మహనీయుఁబోలిక నేను
ఇరుపుర మధ్యను వెరపుతో వగతు.
కన్నె నీయనరయు కలిని కులంబు
వన్నె, చుట్టము మేల్మి వరుసల నెల్ల
నెన్నక మేముగా నేలుకొన్నట్టి
యింపుగా మఱుగున నెనసిన పెండ్లి
జరిగిన విధమును చక్కగా నీవు
నెఱుఁగంగఁ జెప్పుదు నెఱగొనబోకు.

[ప్రేమికుల వృత్తాంతము : నాయిక పొలమునకుఁబోవుట]

వరిగల వెదురును వలచిన ఏన్గు
కరముచాచి తనదు కడుబలిమియగు
ముత్తెముల్గల కొమ్ము మొనఁ జాఅనుంచి
అలపుతీర్చిన చొప్పు నందముతోచు
కొఱ్ఱఎన్నులమీద గుంపుగా వ్రాలు
పులుగులంద్రోలి యీ ప్రొద్దుపోవంగ
మరలిరండని నీవు మముపంపగాను
పులులభయంబుచే నెలకొల్పినట్టి
మ్రానిపై నుంచిన మంచెలోనుండి
వెదురుచే బాగుగా విరచించినట్టి
బూరుగుక్రోవులఁ బులుగులంద్రోలి
మండుటెండమిగులు మధ్యాహ్నమందు.

[నాయిక జలకమాడు కొలను వర్ణన]

పులుగులు గూళ్లకు పోవంగ వచ్చి
నిండు సంద్రములోని నీరు తగ్గంగ
మెండుగా పీల్చిన మేఘమాలికలు
గాలితాకుడువల్ల గగనంబునందు
మద్దెల రవముతోఁ దద్దయుంజేరి
పిడుగు లుఱుములతో వడివచ్చి మెఱపు
లుప్పతిల్లంగను కుప్పలై కూడి
వానలు కురువగా వల్ల ఘనిగిరి
కోనలం దిగజాఱి కానలం బాఱు
తెలినీరు విలసిల్లు నెలయేళ్ల వేడ్క
జలకము లాడుచు తనియక మఱియు
నెలరాళ్లఁ గరగించి నింపినట్లుండు
కొలన జలక్రీడ కూర్మితోఁ జేసి
మలలోన నాడుచు వలపునం బాడి
అపరంజిలో మణు లతికినట్లుండు
వీపున సొంపారు వేనలిఁబిడిచి
తడియార్చు కొనుచును తామ్రాక్షిలొచు.

[నాయికయు చెలికత్తెయు పూలుకోయుట]

* మంకెన పూవులు మావులు ననఁటి
ప్రేంఖన పుష్పముల్ రేఁగులు గోఁగు
మల్లియ సొంపారు మందార సుమము
మొల్లలు కెంపారు మోదుగపూలు

---

* మూలగ్రంథమున 99 రకముల పూవులను కవి పేర్కొనెను.

తిలకము వకుళము దిరిసెన తాండ్ర
కలువలు చెంగల్వ కలిగొట్టు పూలు
విరజాజి బూరుగు వెలిదమ్మి విరులు
సురపొన్న గొజ్జఁగి సురభుల ననలు
కరవీరములుపొన్న కంగేలిపూలు
కురవకము లికుచ కొండమల్లియలు
వంజుల మంజరి వాసంతి పొగడ
అంజనము శిరీష మందము మిగులు
చంపక ముత్పల మింపగు మొగలి
సొంపగు మలయజ సుమము చేమంతి
వెదురుపూవులు మంచి వెలగమొలగలు
మధువు నించినమంచి మాలతిపూలు
సింధువారము తగు జిగిమించు నగరు
ఇందుళము తమాల సింధురములును
పలువగ పూలను వలపునం గోసి
వానలు కడిగిన వలమగు బండ
లోన ప్రోగుగనుంచి లోలాక్షులగుచు
కలకల ధ్వనులీను పులుగులు మిగులు
మలలోన నెలుగెత్తి పిలుచుకొంచుండి
ఫణమొప్పు పిఱుదుల పైవల్వగాను
తలిరు పూవులఁజేయు తగుచీరఁగట్టి
పలురంగు మాలల నలివేణిఁ జుట్టి
పుప్పొడివెదజల్లి పొలుపొందు చన్న
నిప్పన నొప్పారు నిగనిగ లాడు

తలిరు నిండు నశోక తరువునీడలను
కలితముదంబున కన్నెలముండ.

[నాయకుని రాక]

నూనె నలందిన నునుముంగురులకు
చల్లని సౌరభ చందనం బలఁది
తడియార్ప వ్రేళ్లతో వడిఁ జిక్కుతీసి
అగరు పొగలనిచ్చి- అందము మిగులు
వైణిక సంగీత వాఙ్మధు వొలుకు
తుమ్మెద గుంపులు కమ్మగా పాడ
మణిరంగు కురులందు మకరంద మొలయు
మలలోని పూవులు మహిలోని పూలు
కొలకుల పూవులు కొమ్మల పూలు
రంగురంగులపూలు రమ్యతఁ గూర్చి
తగు శిరోభూషణంబుగఁ దొడిగికొని,
వంజుల తలిరులు వన్నెతో నొక్క
చెవిలోన నిడుకొని, శీతచందనము
రంగారు వెడదయురములోన పూల
మాలలు తొడవులు మలయుచునుండ
పొలుపొంది లక్షణ పూర్ణమైయుండు
ముంజేతిలో విల్లు ముదమునఁ బట్టి,
అంపకోల ధరించి యడుగుల నుండు
గండపెండేరంబు కదలియాడంగ
పేర్మిమిగులుకచ్చ బిగువుగా కట్టి
సిరిగల ఒడయుడు చేరువ వచ్చె.

[ప్రేమికుల పరస్పరానురాగ సందర్శనము]

మొనఁబాడు చేసెడి యనిఁ బగవారు
వెన్నిచ్చు చెండాడు వీరపుంగవుల
నొప్పగఁ బెఱవారి నోడించి తలుము
వాడిపళ్లను గోళ్ల వాల్చని కళ్లఁ
గలకుక్కలు వెస మమ్ములఁ జుట్టికొనఁగ
నిలుకడ వదలియు నిండుభయమున
వడఁకుచు తడబడి వగనొంది కలఁగి
యెడబాసిపోవంగ నెదురుగా వచ్చి
కోడెనింబోలిన ఱేడు మాయెడను
మన్నన చూపును మగటిమి మిగుల
తేటగా మెల్లని తేనెపలుకులను
మాటాడి పొగడుచు "మగువరో! లలిత
సుందరాంగముగల సొగసును, సుడిని
బోలు నాభి కలువ పూలను గెలుచు
చల్లని కనుగవ లుల్లసిలు; ఎల
జవ్వనులార! నేఁ జనుదారి తప్పి
వచ్చినాడ" ననుచు వాకొనె నంత
ఏమియుఁ దోచక ఎదురాడఁ జంకి
ఏముండ, చింతతో "ఎలనాగలార!
తప్పినదోవను చెప్పినకూడ
నింద కలుగునొక్కొ! ఎందుకీమౌన"
మనిపల్కి చక్కని యారాజమౌళి
అందున్న కుక్కల యార్భాట మడఁగ
గాంధారసంయు క్త కమనీయ గీత

రాగము మీఱెడి తీగసుబోలి
జుమ్మని కమ్మగా సొగసుగాఁ బాడు
తుమ్మెద గుంపులు తులదూగుచుండ
పుప్పొడి వెదజల్లు పూగొమ్మ వంచి
మదగజము కరణిఁ మగటిమి మించ
కుక్కలం ద్రోలెను కూరిమి మిగులఁ
బత్యుత్తరము వినఁబక్కన నిలిచె.

[వనచరుల బెదరింపున ఏనుగు వచ్చుటయు నాయకుడు కాపాడుటయు]

తాలుచే నల్లిన తగు చిన్నిగుడిసెఁ
గాఁపుపడఁతితోడఁ గమనీయ మైన
తియ్యని చలువఁగొంఁదేనియం గ్రోలి
ముదమొంది కావలి మదిలోన మఱవ
పైరులం దిని చేను పాడుచేయించి
ఏన్గులు తిరుగుట ఎఱిగి నష్టంబు
కని తాల్మి లేకుండ గరళముఁగక్కు
సర్పముం బోలిన శార్ఙ్గమునెత్తి
గాత్ర ధైర్యముచూపి కనలుచు మండు
టమ్ములఁ విడిచియు నార్చియుం గాన
నమ్మ కలఁతనొంద దుమ్ముచేయించి
కొమ్ము లేనుగులను కూయుచుం దఱుమ
కారు మబ్బు లుఱుము గర్జన లొప్ప
ఘీంకార మొనరించి కేలుతో నేల
మోకులఁ గూల్చుచు మత్తేభ మొకటి

ఎదురుగా జమునొప్ప బెదరుచు రాఁగ,
దిక్కెఱుంగక మేము దీనుల మగుచు
దిగులుతోఁ బొగులుచు వగలొంది వడిగ
మెఱుగుల గాజులు మిగులు సద్దిడఁగ
సిగ్గు వీడి యతని చేరువకేగి
వెఱచిన నెమ్మి నా వెఱపున వణక,
మాయెడఁ గరుణించి నాయకు డంత
నెలవంక యమ్మెత్తి నేర్పుమీఱంగ
ఏనుగు మోమున నేయఁగ నదియు
పుండులుమియునల్ల బోరనఁ గాఱ
నెన్నుదుటి సొబగు వన్నెలు మాయ
వెన్నిచ్చి నిల్వక వెసఁ బాఱిపోయె.

[నాయకుడు వెల్లువకు వెఱచిన నాయికను ఓదార్చుట]

మలనుండి పాఱెడు నెలయేటిలోన
నురుగుల తరగలు పెరుగుటఁగాంచి
మేము భయంబొంద మేలైన జేడు
"అబ్జాక్షి! వగవకు మదరకు మలర
ననుభవింతును నీదు అందము" ననుచు
నెన్నుదురును చేత నిమురుచు నెదియొ
తలఁచుచు నామోము తగఁజూచి నవ్వె.

[నాయకుని సంయోగము]

అంత నాయిక సిగ్గు నంజికయుఁ గొని
చేతుల విడిపింప చిఱునగవొలయ

బిగిగౌగిటం జేర్చి పేరురం బందు
నతికించి యెనయించి యానందమొందె.

[నాయకుని దేశప్రాభవము]

పండిన మిరియాలు పడి నిండియుండు
బండలో బోనసీట, కొండమామిడుల
పండులు పడియును, పనసపండ్లూడి
తేనె చిందియు నుండు తీయని మధువు
నీరని త్రాగిన నెమళులు సోలి
ఊరిలో తిరునాళ్ల నురుతాళగతిని
వెదురుత్రాడున నాడు వెలది నొప్పంగ
ఆడుచునుండు పౌ ల్పమరు శైలములు,
మిన్ను నొరయుచుండు చెన్నగు శిఖర
ములుగల మలతేడు వలపుంచువాడు
తలపెఋంగుచు మమ్మ తనియంగఁజేసి.

నాయకుని ప లుకులు]

"తిరునాళ్ల నొప్పంగ తిరమైన కూడు
వచ్చినవారికి వారకఁ గుడిపి
కలిమి నిండినయిల్లు కమనీయమొంద
తలుపులు మూయక తగువిందుచేసి
పాలు నేతులతోడ పక్వాన్నము లిడ
పొగడొందు పెద్దలు భుజియింప మిగులు
కూడు నీ తోడనేఁ గూర్చుండి తినెడి
విమల గృహస్థజీవిత మొందుఁగాత!

[నాయకుని ఒట్టు]

అనిచెప్పి ధార్మికం బగుదారిఁ దేల్చి
గిరికుమారస్వామిఁ గేల్మోడ్చి మ్రొక్కి
తీయనితోయంబు తెలివొంద ద్రాగి
ఒట్టు పల్కి నిజంబు లొప్పచెప్పంగ
ఇమ్ముగా విని మాదు ఎద చల్లపడెను
అడవిలో నేస్గుచేఁ బడసిన పొందు,
వేల్పులు వలచెడు వేడుక నించు
పూలతో పొలుపొందు పొదరిండ్లలోన
పగలంతయుఁ గడప తగ ప్రొద్దుఁబోయె.

[సాయంకాల వర్ణన]

ఏడుగుఱ్ఱముల తేరెక్కిన తేడు
పడమటికొండలోఁబడి దాగికొనగ
దుప్పులు మ్రాకుల దుబ్బులోఁగూడ
దూడలం బిల్చుచు దొరకొని ఆల
మందలు నిండుగ మహిఁ జొరపడగ
పెదతాటిమ్రానిపై పిల్లనగ్రోవి
కలరవమొప్ప జక్కవజంటఁబిలువ
చిలువలుమణులమ వెలుగుకై యుమియ
కలువలరేకులు పొలుపుగ విరియ
కలిమినిండినఇంటఁ గనకాంగు లపుడు
దివ్వెలు వెలిగించి తేజరిల్లంగ
గొల్లలు పిల్లన గ్రోవినిం బాడ
బాపనుల్ సంధ్యలో ప్రార్థనల్ చేయ

మింటినిదాకెడు మేలగు మంచె
నున్నబోయ లరణి నులుముచు నిప్పు
కలిగించి ముదమొంద, కార్మబ్బు లలమి
మలలోన గుమికూడి నలిరంగునీయ,
కాన మెకము లెల్ల కలకలమొంద
పులుగులు నెలుగింప, పోరికిం బోవు
పగగొన్నరాజుల భటరవ మొప్ప
నెగడెడి పంజలో నెమ్మది మీఱ.

[నాయకుని వీడ్కోలు]

"పాణిగ్రహణము నీబాంధవు లివ్వ
లోకమెఱుఁగుపెండ్లి లోలాక్షి! చేతుఁ
గలతచెందకు మింక! కలదు కొన్నాళ్లే"
అనిపల్కి చనవుగా నడవిని విడిచి
కవగూడు కోడెనా కలసి పూతోడ
వచ్చి మృదంగపువాద్య ముప్పతిలు
రేవున నిలిపి తా నావలం జనెను.

[నాయకునికి కలుగు అంతరాయములు]

ఆప్రొద్దు మొదలుగా ఆనాటి వలెనె
వేడ్కమీఱ నెపుడుఁ వెఃఁ వచ్చుచుండు
రేలందువచ్చెడి వేళలో భయద
రక్షకభటు లటు రాఁగలిగినను
కుక్కలు మొఱిగినా కునుకక నీవు
మెలకువనున్నను, వెలుతురు మిగుల

వెన్నెలకాసినా, వెలదిని పొంద
దొరకక వెనుకకు మరలును గాని
విసుగుచెందడురాజ వీరపుంగవుడు
వైభవస్ఫూర్తితో వఱలెడువాడు.

[నాయకునకు కలుగు ఆపదలం దలచి నాయిక కుందుట]

భయదమౌ ఊరికిఁ బలుమాఱు రాక
నయముకాదని యెంచి నవయుచు నీమె
చినుకులుపడిన పూవునుబోలి కలగు
కనుగవ పొలుపఱి కన్నీరు నిండ
నునులేత చనులందు తునుకలై జాఱ
వలఁబడ్డ నెమలినా యలమటం జెంది
తలచుచుం దలచుచుం బలవించుచుండు.

[నాయకుడు వచ్చుదారిలోగల ఆపదలు]

రాతిరిం గుహకేగు రక్తముం గ్రోలు
శార్దూలములు పెద్దశరభము లడవి
ఏనుగు లెనుబోతు లెలుగులు పులులు
కడిఁదియౌ పిడుగులు కాననవేల్పు
లెరనేఱుపాములు నెదిరించు పందు
లరయరాని సుడులు వఱలు కొలకుల
క్రూరగ్రాహంబులు కొలజేయు తలము

లరుదగు తెరువులు నడుసుచే జాఋ
కోనలు, చిలువలు కొదమసింగములు
నింక పెక్కుంగల యెడరులు నతని
మలదారిలో నిండఁ గలవు గావుననె.

ఆర్యనృపతియైన భృగదత్తునికి తమిళభాషాప్రాశస్త్యము తెలుపుటకు కపిల మహాకవి రచించినది.

శైలగీతము సమాప్తము.



# చాటువులు

క. నీదోషములేదు వెలది
యేదోషములేనిచరిత యేనును నెఱుగన్
నాదోషము మఱి నృపునకుఁ
గాదే దోషము నరయగ గాంచుము తల్లీ. 1

క. పొగడు త్రివర్గము తిరముగ
నెగడగ రచియించె నిద్ది నిర్మలవేదం
బగపడ నుడివిన అష్టం
బగు పరిణయముల గిరిగల యైదవదానిన్. 2

(ఈ రెండు పద్యములు తమిళమున విజ్ఞులచే ప్రక్షిప్త ములుగా తలపబడుచున్నవి. వీని భావార్థము క్రింద వచనరూపమున గలదు.)

1. ''తల్లీ నీ దోషమేమియు లేదు. నాయికయు నిర్దోషియే. నాదోషమేమైన నున్నట్లును నే నెఱుగను. ఇక నాయకునిపై ఏదోషమును లేదు (కాన ఇది దైవసంకల్పము! ఎవరిమీదను దోషము లేదు. ఈ గాంధర్వవివాహము న్యాయసమ్మతమైనదే. కాన వీరిరువురకు వివాహము

చేయించుట యుక్తము" అని చెలికత్తె చెప్పినట్లు పద్య భావమున్నది.

2. నిర్మల వేదంబున చెప్పబడిన అష్టవిధ వివాహాము (బ్రాహ్మము, ప్రాజాపత్యము, ఆర్షము, దైవము, గాంధర్వము, ఆసురము, రాక్షసము, పైశాచము) లందు పంచమంబైన గాంధర్వవివాహాము గిరిప్రాంత విహితముగా రచించిన శైలగీతమున త్రివర్గములను (ధర్మార్థకామములను) వివరించడమైనది.



# కఠినపదములకు అర్థములు

అంజిక = భయము

అంపకోల = బాణము

అగరుపొగ = చందన ధూపద్రవ్యవిశేషము (సాంబ్రాణివంటిది) (அகில்புகை)

అదరకుము = భయపడకుము

అని = రణరంగము

అమ్ములు = బాణములు

అరణి = మథించి నిప్పుపుట్టించెడి కొయ్య

అలమట = చింత

ఉవిద = స్త్రీ

ఎడరులు = ఆపదలు

ఎనసిన = పొందిన (ఎనయు = పొందు)

ఎర సేఁకు = ఆహారము వెదకి ఎత్తికొను

ఎఱ గొనబోకు = కోపించకుము

ఒట్టు = శపథము

ఒడయడు = రాజు

కచ్చ = కోఁచిగా పెట్టబడు వస్త్రము (కాసెకోక)

కట్టడ = నియమము, మర్యాద

కన్నెఱికంబు=కన్యాత్వము

కాపు=సేద్యము చేయువాడు

కావలి=రక్షణము

కనుకక=నిదురింపక

కొఱ్ఱువెన్నులు=కొఱ్ఱుల కంకులు (కొఱ్ఱులు=ధాన్యవిశేషము)

కోడె=ఋషభము-విటుడు.

కోన=కొండలయందలి మఱుగుచోటు

క్రాలు=ప్రకాశించు-ఒప్పు

గండపెండరంబు=శూరులు బిరుదుగా కాలను ధరించెడి యందియ

గరళము=విషము

గాత్రధైర్యము=శరీరబలము

చిలువలు=పాములు

తామ్రాక్షులు=ఎఱ్ఱని కన్నులు కలిగినవారు

తాలు=ఎన్నుతీసి ఎండిపోయిన పైరు

తాల్మి=క్షమ

తిరునాళ్లు=ఉత్సవదినము

తీగ=లత

తులదూగుచుండ=నిండియుండ

తోడవులు=భూషణములు

దిగులు=భయము

దివ్వెలు=దీపములు

దుప్పులు=జింకలు

దుబ్బు=తృణ స్తంభము

దొరఁకొను ఆలు=యత్నించిన ఆవులు

ననలు=పూవులు

నల్ల=రక్తము

నవయుచు=శుష్కించుచు

నిమురుట=చేతితో శరీరమును దువ్వుట

నుదురు=నెత్తి

నురుగులతరగలు=నురుగులు మిగులు అలలు

నులుము=రెండు వ్రేళ్లతో గట్టిగా పట్టి యటునిటు త్రిప్పు

నెమ్మి=మయూరము, ప్రేమ

నెలవంక అమ్ము = అర్ధచంద్రాకారముగల బాణ విశేషము

పడతి=స్త్రీ

పుండుమీయునల్ల =వ్రణమునుండి కారెడి రక్తము

పుత్తడి=బంగారము

పులుగు=పక్షి

పొగులు=పరితపించు

ప్రాఁబ్రోలు=ప్రాతఊరు

బాపనల్ =బ్రాహ్మణులు

బోయలు=కిరాతులు

మంచె=జొన్న చేను మొదలగుచోట్ల కూర్చుండుటకు ఎత్తుగా వేసెడు చప్పరమువంటి పందిరి.

మంతనంబు=రహస్యము; ఏకాంతము

మల=కొండ

మెలకువ=జాగ్రదవస్థ

మొన=సైన్యము

రంగారు పెడదయురంబు = కాంతిమిగులు విపుల వక్షము.

రేకులు=పుష్పదళములు

రేవు=నదులందు మనుష్యులు దిగుట కనువుగా నేర్పరచిన దారి

లికుచ=గజనిమ్మచెట్టు

వంజుల తలిరులు=అశోకవృక్షపు లేతఆకులు

వగ=చింత

వరిగలవెదురు=వరివంటి ధాన్యముగల వెదురుచెట్టు

వలులు=ప్రకాశించు

వలచిన=ఇచ్ఛగించిన

వలమగుబండ=విస్తారమైనబండ

వారక=ఎడతెగక

విరులు=పూవులు

వెదురుత్రాడు = రెండు వెదురుకొయ్యల మధ్య కట్టిన త్రాడు

వెలది = స్త్రీ

వెస = త్వరితము

వైభవస్ఫూర్తి = వైభవము మిగులు పరిపూర్ణత

శరభము = మిాగండ్ల మెకము – (భయంకరమృగ విశేషము)

సొన = ఊటకాలువ.



# கபிலர் இயற்றிய குறிஞ்சிப்பாட்டு

அன்னாய் வாழிவேண் டன்னை யொண்ணுதல்
ஒலிமென் கூந்தலென் றோழி மேனி
விறலிழை நெகிழ்த்த வீவருங் கடுநோய்
அகலு ளாங்க ணறியுநர் வினாயும்
பரவியுந் தொழுதும் விரவுமலர் தூயும்
வேறுபல் லுருவிற் கடவுட் பேணி
நறையும் விரையு மோச்சியு மலவுற்று
எய்யா மையலை நீயும் வருந்துதி
நற்கவின் றொலையவும் நறுந்தோள் நெகிழவும்
புட்பிற ரறியவும் புலம்புவந் தலைப்பவும்
உட்கரந் துறையு முய்யா வரும்படர்
செப்பல் வன்மையிற் செறித்தியான் கடவலின்
முத்தினு மணியினும் பொன்னினு மத்துணை
நேர்வருங் குரைய கலங்கெடிற் புணரும்
சால்பும் வியப்பு மியல்புங் குன்றின்
மாசறக் கழீஇ வயங்குபுகழ் நிறுத்தல்
ஆசறு காட்சி யையர்க்கு மந்நிலை
எளிய வென்னார் தொன்மருங் கறிஞர்
மாதரு மடனு மோராங்குத் தணப்ப
நெடுந்தே ரெந்தை யருங்கடி நீவி
இருவே மாயந்த மன்ற லிதுவென
நாமறி வுருலிற் பழியு முண்டோ
ஆற்றின் வாரா ராயினு மாற்ற
ஏனை யுலகத்து மியைவதால் நமக்கென
மானமர் நோக்கங் கலங்கிக் கையற்று
ஆனாச் சிறுமைய ளிவளுந் தேம்பும்
இகல்மீக் கடவு மிருபெரு வேந்தர்
வினையிடை நின்ற சான்றோர் போல
இருபே ரச்சமோடு யானு மாற்றலென்
கொடுப்பினன் குடைமையும் குடிநிர லுடைமையும்
வண்ணமுந் துணையும் பொரீஇ யெண்ணாது

எமியேந் துணிந்த ஏமஞ்சா லருவினை
நிகழ்ந்த வண்ணம் நீநனி யுணரச்
செப்ப லான்றிசிற் சினவா தீமோ
நெற்கொள் நெடுவெதிர்க் கணந்த யானை
முத்தார் மருப்பி னிறங்குகை கடுப்பத்
துய்த்தலை வாங்கிய புனிறுதீர் பெருங்குரல்
நற்கோட் சிறுதினைப் படுபு ளோப்பி
எற்பட வருதிய ரெனநீ விடுத்தலிற்
கலிகெழு மரமிசைச் சேணோ னிழைத்த
புலியஞ் சிதண மேறி யவண
சாரற் சூரற் றகைபெற வலந்த
தழலுந் தட்டையுங் குளிரும் பிறவும்
கிளிகடி மரபின வூழூழ் வாங்கி
உரவுக்கதிர் தெறூஉ முருப்பவி ரமயத்து
விசும்பாடு பறவை வீழ்பதிப் படர
நிறையிரும் பெளவங் குறைபட முகந்துகொண்டு
அகலிரு வானத்து வீசுவளி கலாவலின்
முரசதிர்ந் தன்ன வின்குர லேற்றொடு
நிரைசெலல் நிவப்பிற் கொண்மூ மயங்கி
இன்னிசை முரசிற் சுடர்ப்பூட் சேஎய்
ஒன்னார்க் கேந்திய விலங்கிலை யெஃகின்
மின்மயங்கு கருவிய கன்மிசைப் பொழிந்தென
அண்ணல் நெடுங்கோட் டிழிதரு தெண்ணீர்
அவிர்துகில் புரையு மவ்வெள் ளருவித்
தவிர்வில் வேட்கையேந் தண்டா தாடிப்
பளிங்கு சொரிவன்ன பாய்சுனை குடைவுழி
நளிபடு சிலம்பிற் பாயம் பாடிப்
பொன்னெறி மணியிற் சிறுபுறந் தாழ்ந்தவெம்
பின்னிருங் கூந்தல் பிழிவனந் துவரி
உள்ளகஞ் சிவந்த கண்ணேம் வள்ளிதழ்
ஒண்செங் காந்த ளாம்ப லனிச்சம்
தண்கயக் குவளை குறிஞ்சி வெட்சி
செங்கொடு வேரி தேமா மணிச்சிகை

உரிதுநா றவிழ்தொத் துந்தூழ் கூவிளம்
எரிபுரை யெறுழஞ் சுள்ளி கூவிரம்
வடவனம் வாகை வான்பூங் குடசம்
எருவை செருவிளை மணிப்பூங் குரவம்
பசும்பிடி வகுளம் பல்லிணர்க் காயா
பயினி வானி பல்லிணர்க் காயா
விரிமல ராவிரை வேரல் சூரல்
குரீஇப் பூளை குறு நறுங் கண்ணி
குருகிலை மருதம் விரிபூங் கோங்கம்
போங்கந் திலகந் தேங்கமழ் பாதிரி
செருந்தி யதிரல் பெருந்தண்சண்பகம்
கரந்தை குளவி கடிகமழ் கலிமாத்
தில்லை பாலை கல்லிவர் முல்லை
குல்லை பிடவஞ்சிறுமா ரோடம்
வாழை வள்ளி நீணறு நெய்தல்
தாழை தளவ முட்டாட் டாமரை
ஞாழல் மௌவல் நறுந்தண் கொகுடி
சேடல் செம்மல் சிறுசெங் குரலி
கோடல் கைதை கொங்குமுதிர் நறுவழை
காஞ்சி மணிக்குலைக் கட்கமழ் நெய்தல்
பாங்கர் மரா அம் பல்பூந் தணக்கம்
ஈங்கை யிலவந் தூங்கிணர்க் கொன்றை
அடும்பம ராத்தி நெடுங்கொடி யவரை
பகன்றை பலாசம் பல்பூம் பிண்டி
வஞ்சி பித்திகஞ் சிந்து வாரம்
தும்பை துழா அய் சுடர்ப்பூந் தோன்றி
நந்தி நறவம் நறும்புன் னாகம்
பாரம் பீரம் பைங்குருக் கத்தி
ஆரங் காழ்வை கடியிரும் புன்னை
நரந்தம் நாகம் நள்ளிரு ணாறி
மாயிருங் குருந்தும் வேங்கையும் பிறவும்
அரக்குவிரித் தன்ன பரேரம் புழகுடன்
மாலங் குடைய மலிவன மறுகி

வான்கண் கழீஇய அகலறைக் குவைஇப்
புள்ளா ரியத்த விலங்குமலைச் சிலம்பின்
வள்ளுயிர்த் தெள்விளி யிடையிடைப் பயிற்றிக் 100
கிள்ளை யோப்பியுங் கிளையிதழ் பறியாப்
பைவிரி யல்குற் கொய்தழை தைஇப்
பல்வே றுருவின் வனப்பமை கோதையெம்
மெல்லிரு முச்சிக் கவின்பெறக் கட்டி 105
எரியவி ருருவி னங்குழைச் செயலைத்
தாதுபடு தண்ணிழ லிருந்தன மாக
எண்ணெய் நீவிய சுரிவளர் நறுங்காழ்த்
தண்ணறுந் தகரங் கமழ மண்ணி
ஈரம் புலர விரலுளர்ப் பவிழாக் 110
காழகி லம்புகை கொளீஇ யாழிசை
அணிமிகு வரிமிஞி றார்ப்பத் தேங்கலந்து
மணிநிறங் கொண்ட மாயிருங் குஞ்சியின்
மலையவும் நிலத்தவுஞ் சினையவுஞ் சுனையவும்
வண்ண வண்ணத்த மலராய்பு விரைஇய
தண்ணறுந் தொடையல் வெண்போழ்க் கண்ணி 115
நலம்பெறு சென்னி நாமுற மிலைச்சிப்
பைங்காற் பித்திகத் தாயித ழலரி
அந்தொடை யொருகாழ் வளைஇச் செந்தீ
ஒண்பூம் பிண்டி யொருகாது செரீஇ
அந்தளிர்க் குவவுமொய்ம் பலைப்பச் சாந்தருந்தி 120
மைந்திறை கொண்ட மலர்ந்தேந் தகலத்துத்
தொன்றுபடு நறுந்தார் பூணொடு பொலியச்
செம்பொறிக் கேற்ற வீங்கிறைத் தடக்கையின்
வண்ண வரிவில் லேந்தி யம்புதெரிந்து
நுண்வினைக் கச்சைத் தயக்கறக் கட்டி 125
இயலணிப் பொலிந்த வீகை வான்கழல்
துயல்வருந் தோறுந் திருந்தடிக் கலாவ
முனைபாழ் படுக்குந் துன்னருந் துப்பிற்
பகைபுறங் கண்ட பல்வே லிளைஞரின்
உரவுச்சினஞ் செருக்கித் துன்னுதொறும் வெகுளும் 130

முளைவா ளெயிற்ற வள்ளுகிர் ஞமலி
திளையாக் கண்ண வளைகுபு நெரிதர
நடுங்குவன மெழுந்து நல்லடி தளர்ந்து யாம்
இடும்பைகூர் மனத்தேம் மருண்டுபுலம் படர
மாறுபொரு தோட்டிய புகல்வின் வேறுபுலத்து
ஆகாண் விடையி னணிபெற வந்தெம்
அலமர லாயிடை வெரூஉத லஞ்சி
மெல்லிய வினிய மேவரக் கிளந்தெம்
ஐம்பா லாய்கவி னேத்தி யொண்டொடி
அசைமென் சாய லவ்வாங் குந்தி
மடமதர் மழைக்கண் இளையீ ரிறந்த
கெடுதியு முடையே னென்றன னதனெதிர்
சொல்லே மாதலின் அல்லாந்து கலங்கிக்
கெடுதியும் விடீஇ ராயி னெம்மொடு
சொல்லலும் பழியோ மெல்லிய லீரென
நைவளம் பழுநிய பாலை வல்லோன்
கைகவர் நரம்பி னிம்மென விமிரும்
மாதர் வண்டொடு சுரும்புநயந் திறுத்த
தாதவி ழலரிந் தாசினை பிளந்து
தாறடு களிற்றின் வீறுபெற வோச்சிக்
கல்லென் சுற்றக் கடுங்குர லவித்தெம்
சொல்லற் பாணி நின்றன னாக
இருவி வேய்ந்த குறுங்காற் குரம்பைப்
பிணையேர் நோக்கின் மனையோள் மடுப்பத்
தேம்பிழி தேறல் மாந்தி மகிழ்சிறந்து
சேம மடிந்த பொழுதின் வாய்மடுத்து
இரும்புனம் நிழத்தலிற் சிறுமை நோனாது
அரவுற ழஞ்சிலை கொளீஇ நோய்மிக்கு
உரவுச்சின முன்பா லுடற்சினஞ் செருக்கிக்
கணைவிடு புடையூக் கானங் கல்லென
மடிவிடு வீளையர் வெடிபடுத் தெதிரக்
கார்ப்பெய லுருமிற் பிளிறிச் சீர்த்தக
இரும்பிணர்த் தடக்கை யிருநிலஞ் சேர்த்திச்

சினந்திகழ் கடாஅஞ் செருக்கி மரங்கொல்பு
மையல் வேழ மடங்கலி னெதிர்தர
உய்விட மறியே மாகி யொய்யெனத்
திருந்துகோ லெல்வளை தெழிப்ப நாணுமறந்து
விதுப்புறு மனத்தேம் விரைந்தவற் பொருந்திச்
சூருறு மஞ்ஞையி னடுங்க வார்கோல்
உடுவுறும் பகழி வாங்கிக் கடு ஈசை
அண்ணல் யானை யணிமுகத்
புண்ணுமிழ் குருதி முகம்பாய்ந் திழிதரப்
புள்ளி வரிநுதல் சிதைய நில்லாது
அயர்ந்துபுறங் கொடுத்த பின்னர் நெடுவேள்
அணங்குறு மகளி ராடுகளங் கடுப்பத்
திணிநிலைக் கடம்பின் திரளரை வளைஇய
துணையறை மாலையிற் கைபிணி விடேஎம்
நுரையுடைக் கலுழி பாய்தலி னுரவுத்திரை
அடுங்கரை வாழையின் நடுங்கப் பெருந்தகை
அஞ்சி லோதி யசையல் யாவதும்
அஞ்ச லோம்புநின் அணிநல நுகர்கெனா
மாசறு சுடர்நுதல் நீவி நீடுநினைந்து
என்முகம் நோக்கி நக்கன னந்நிலை
நாணு முட்கும் நண்ணுவழி யடைதர
ஒய்யெனப் பிரியவும் விடாஅன் கவைஇ
ஆக மடைய முயங்கலி னவ்வழிப்
பழுமிள குக்க பாறை நெடுஞ்சுனை
முழுமுதற் கொக்கின் தீங்கனி யுதிர்ந்தெனப்
புள்ளெறி பிரசமொ டீண்டிப் பலவின்
நெகிழ்ந்துகு நறும்பழம் விளைந்த தேறல்
நீர்செத் தயின்ற தோகை வியலூர்ச்
சாறுகொ ளாங்கண் விழவுக்களம் நந்தி
அரிக்கூட் டின்னியங் கறங்க ஆடுமகள்
கயிறூர் பாணியிற் றளருஞ் சாரல்
வரையர மகளிரிற் சாஅய் விழைதக
விண்பொருஞ் சென்னிக் கிளைஇய காந்தட்

டண்கம முலரி தாஅய் நன்பல
வம்புவிரி களத்திற் கவின்பெறப் பொலிந்த
குன்றுகெழு நாடனெம் விழைதரு பெருவிறல்
உள்ளத் தன்மை யுள்ளினன் கொண்டு 200
சாறயர்ந் தன்ன மிடாஅச் சொன்றி
வருநர்க்கு வரையா வளநகர் பொற்ப
மலரத் திறந்த வாயில் பலருணப்
பைந்நிணை மொழுகிய நெய்ம்மலி யடிசில்
வசையில் வான்றிணைப் புரையோர் கடும்போடு 205
விருந்துண் டெஞ்சிய மிச்சில் பெருந்தகை
நின்னோ டுண்டலும் புரைவ தென்றாங்கு
அறம்புணை யாகத் தேற்றிப் பிறங்குமலை
மீமிசைக் கடவுள் வாழ்த்திக் கைதொழுது
ஏமுறு வஞ்சினம் வாய்மையிற் றேற்றி 210
அந்தீந் தெண்ணீர் குடித்தலின் நெஞ்சமர்ந்து
அருவிட ரமைந்த களிறுதரு புணர்ச்சி
வானுரி யுறையுள் வயங்கியோ ரவாவும்
பூமலி சோலை யப்பகல் கழிப்பி
எல்லை செல்ல வேழூர் பிறைஞ்சிப் 215
பல்கதிர் மண்டிலங் கல்சேர்பு மறைய
மான்கண மரமுதற் றெவிட்ட ஆன்கணங்
கன்றுபயிர் குரல மன்றுநிறை புகுதர
ஏங்குவயி ரிசைய கொடுவா யன்றில்
ஓங்கிரும் பெண்ணை யகமட லகவப் 220
பாம்புமணி யுமிழப் பல்வயிற் கோவலர்
ஆம்பலம் தீங்குழற் றெள்விளி பயிற்ற
ஆம்ப லாயிதழ் கூம்புவிட வளமணைப்
பூந்தொடி மகளிர் சுடர்தலைக் கொளுவி
அந்தி யந்தண ரயரக் கானவர் 225
விண்தோய் பணவை மிசைஞெகிழி பொத்த
வான மாமலை வாய்சூழ்பு கறுப்பக் கானம்
கல்லென் றிரட்டப் புள்ளின மொலிப்பச்
)ய வேந்தன் செல்சமங் கடுப்பத்

துனை இய மாலை துன்னுதல் கானுர் உ 230
நேரிறை முன்கை பற்றி நுமர்தர
நாடறி நன்மண மயர்கஞ் சின்னுள்
கலங்க லோம்புமி னிலங்கிழை யீரென
ஈர நன்மொழி தீரக் கூறித்
துணைபுண ரேற்றி னெம்மொடு வந்து 235
துஞ்சா முழவின் மூதூர் வாயில்
உண்துறை நிறுத்துப் பெயர்ந்தன னதற்கொண்டு
அன்றை யன்ன விருப்போ டென்றும்
இரவரல் மாலைய னேவரு தோறும்
காவலர் கடுகினுங் கதநாய் குரைப்பினும் 240
நீதுயி லெழினும் நிலவுவெளிப் படினும்
வேய்புரை மென்தோள் இன்துயி லென்றும்
பெருஅன் பெயரினு முனிய லுருஅன்
இளமையி னிகந்தன்று மிலனே வளமையின்
தன்னிலை தீர்ந்தன்று மிலனே கொன்னூர்ர் 245
மாய வரவி னியல்புநினை இத் தேற்றி
நீரெறி மலரிற் சாஅ யிதழ்சோரா
ஈரிய கலுழுமிவள் பெருமதர் மழைக்கண்
ஆகத் தரிப்பனி யுறைப்ப நாளும்
வலைப்படு மஞ்ஞையி னலஞ்செலச் சாஅய் 250
நினைத்தொறுங் கலுழுமா லிவளே கங்குல்
அளைச்செறி யுழுவையு மாளியு முளியமும்
புழற்கோட் டாமான் புகல்வியுங் களிறும்
வலியிற் றப்பும் வன்கண் வெஞ்சினத்து
உருமுஞ் சூரு மிரைதே ரரவும் 255
ஒடுங்கிருங் குட்டத் தருஞ்சுழி வழங்கும்
கொடுந்தாள் முதலையு மிடங்கருங் கராமும்
நூழிலு மிழுக்கு மூழடி முட்டமும்
பழுவும் பாந்தளு முளப்படப் பிறவும்
வழுவின் வழாஅ விழுமமவர்
குழுமலை விடரக முடையவா லெனவே. 261

ஆரியவரசன் பிரகத்தனைத் தமிழறிவித்தற்குப் பாடியது.